## చిత్రకారుని గురించి



ఆంతోని వాన్‌డిక్ (1599 - 1641)

1599 మార్చి 22 న ఆంట్ వెర్ప్‌ల్ ఫ్రాన్స్‌వాన్‌డిక్‌కు అతని రెండో భార్య మారియా కుయిపెర్స్‌కు ఏడవ సంతానంగా జన్మించాడు. 1641లో మేరీ రూత్‌వెన్‌ను వివాహం చేసుకొన్నాడు. 1641లో కూతురు పుట్టింది. అదే సంవత్సరం మరణించాడు.

ఆడవాళ్ళను బాగా ఆకర్షించేవాడు. తనకు మోడల్స్‌గా కూర్చొన్న వారిలో చాల మందితో అతనికి సంబంధాలున్నాయంటారు. ఇతనికి ఒక ఉంపుడుగత్తె ఉంది. చాల అసూయాపరురాలు. లండన్ స్త్రీలు అతనికి మోడల్స్‌గా పని చేస్తుంటే రుసరుసలాడేది. ఒకసారి అసూయ పెల్లుబికి, మరెప్పటికి అతడు పెయింట్ చేయకుండా ఉండాలని అతని బొటనవ్రేలు కొరికివేసింది.

## ముఖ చిత్రం: మన్మథుడు - ఆత్మ (1638)

ఇది చాల కవితాత్మకం: సౌందర్యాన్ని ఒలికే చిత్రం. అతడు ఇంగ్లాండ్‌లో ఉన్నప్పుడు చిత్రించిన చిత్రాలలోని ఒకే ఒక పౌరాణిక చిత్రం ఇది. చార్లెస్ రాజు1 కోసం చేశాడు. "మన్మథ - ఆత్మ చిత్రం" లోని అసలు కథ ఏమిటంటే. వాంఛ (desire) తో సమైక్యం చెందాలనే ఆత్మ చేసే అన్వేషణ. ఆంతోని వాన్‌డిక్ కళాచరిత్రలోనే మనుషుల చిత్రాలు పెయింట్ చేయడంలో అత్యంతంగా విజయవంతమైన కళాకారుడు. చార్లెస్ రాజు 1 ఆస్థానాన్ని చిత్రించిన మిరుమిట్లు గొలిపే అతని చిత్రాలు, అతని జీవిత కాలంలో అత్యంతంగా ఇతర కళాకారులను ప్రభావితం చేశాయి. అంతేకాదు, ఆ తరవాత రెండు వందల సంవత్సరాల పాటు ఆంగ్ల కళాకారుల మానవ చిత్రణను ప్రభావితం చేశాయి. అతడు వయస్సుకు మించిన తెలివి తేటలు కలవాడు. రూబెన్స్‌తో ప్రభావితుడయ్యాడు. ఆంటెవెర్ప్‌లో అతనితో పని చేశాడు. ఏది ఏమైనా అతడు గురు ముఖతః కంటె స్వయంగా నేర్చుకొందే ఎక్కువ.

1621లో ఇటలీ వెళ్ళాడు. అక్కడ జెనియోస్ జమిందారుల, ఉన్నత కుల సంజాతుల చిత్రాలు చిత్రించి మంచి పేరు తెచ్చుకొన్నాడు. ఆ తరవాత ఆరు సంవత్సరాలకు ఆంటెవెర్ప్‌కు తిరిగి వచ్చాడు. అనేక మంచి చిత్రాలు వేయడానికి అతనికి అనేక ఆర్డర్లు వచ్చాయి, ఇజాబెలా జమీందారిణికి ఆస్థాన చిత్రకారుడుగా నియమితుడయ్యాడు.

1632లో వాన్‌డిక్‌ను చార్లెస్‌రాజు 1 ఇంగ్లాండుకు రావించి ఆస్థాన పెయింటర్‌గా నియుక్తుడ్ని చేశాడు. విజయాలైతే సాధించాడు గానీ తన జీవితాశయమైన "చరిత్ర-పెయింటర్" కాలేక పోయాడు.

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." - Dammapada.**


సంపుటి 13 ఏప్రిల్ 2001 సంచిక 4

వ్యవస్థాపక సంపాదకుడు : **డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి**


## విషయ సూచిక




విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/- విదేశీయులకు $ 20

ముఖచిత్రం : **మన్మథుడు - ఆత్మ**

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd - 20. Ph. 7645536
E-mail : misimieditor@rediffmail.com

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# మిసిమి రచయితలకు

నమస్కారములు. లోగడ 1999 నవంబరు - డిసెంబరు పోస్ట్ మోడర్నిజమ్ మిసిమి ప్రత్యేక సంచికకు, ఇప్పుడు ఏరిక్ ఫ్రామ్‌పై తెచ్చిన మిసిమి ప్రత్యేక సంచికకు తమ అమూల్యమైన వ్యాసాలను పంపి **'మిసిమి'** ప్రతిష్ఠను ఇనుమడింప జేసిన వ్యాస రచయితలకు హృదయ పూర్వక అభినందనలు, అభివాదాలు. అయితే మన **'మిసిమి'**కి వ్యాసాలు పంపే రచయితలంతా మేధావి వర్గానికి చెందినవారు. అంతేకాదు, వారంతా లబ్ధ ప్రతిష్ఠులు. సహజంగా వారు నిత్య జీవితంలో తమ ప్రపంచానికి ప్రతి స్పందించవలసిన తీరు అదే స్థాయిలో ఉంటుంది. బహుశ ఆకారణాన మేము అడిగినదే తడవుగ సకాలంలో పత్రికకు వ్యాసాలు పంపలేక పోతున్నారు.

పత్రిక, కాలం పోటీ పడి పరుగులు తీస్తాయి. కాలంతో పత్రికను పరుగెత్తించాలంటే - భావాల పరంగా, ప్రచురణా పరంగా రెండు విధాల - రచయితల అవిలంబిత తోడ్పాటు అవసరం. ఈ విషయాన్ని రచయితల దృష్టికి తెస్తున్నాము.

మార్చి నెల **'మిసిమి'** ఫ్రామ్ ప్రత్యేక సంచికకు కాలం తప్పి ప్రసిద్ధులైన వారి వ్యాసాలే అందాయి. వాటిని ఈ ఏప్రిల్ నెల సంచికలో ప్రచురిస్తున్నామని తెలియజేయడానికి సంతోషిస్తున్నాము.

**మరో విజ్ఞప్తి** : రచయితలు తమ వ్యాసాలను విస్పష్టమైన దస్తూరితో పంపితే ఎక్కువ తప్పులను పరిహరించే అవకాశం ఉంటుంది.

(మార్చి నెల సంచికలోని మొదటి ఆర్టికల్ రచయిత రావెల సోమయ్యగా గ్రహించమనవి)

**- సంపాదకుడు**

# అస్తిత్వ సమస్యకి సమాధానం ఎరిక్ ఫ్రామ్

- డాక్టర్ పాపినేని శివశంకర్

నేనేమిటి? సమాజంలో నేనేమిటి? ప్రకృతికీ నాకూ సంబంధమేమిటి? మానవాస్తిత్వంలో మౌలిక ప్రశ్నలివి. వీటికి సమాధానం అన్వేషించటంలోనే తత్వశాస్త్రం తలమునకలవుతుంది. పరలోకాన్ని గౌణం చేసి, పదార్థమే ప్రమాణంగా బయల్దేరిన భౌతికవాద తత్వానికి ఈ అన్వేషణ మరీకష్టం. ఈ విషయంలో ఎరిక్ ఫ్రామ్ వెతుకులాట నెరవేరిందనే అనుకుంటాను.

ఫ్రామ్ పాశ్చాత్య తత్వవేత్త. అతను ప్రధానంగా పరిశీలించింది ఆ సమాజాన్నే. అయినా అతని పరిశీలనల్ని మన సమాజానికి అన్వయించినా అతివ్యాప్తి ఏమంత ఉండదు. వాటి మౌలికత్వం అటువంటిది. బౌద్ధ దర్శన ప్రభావం అతని రచనలపై ఎంతగానో వుంది. అందువల్ల కూడా అతని ఆలోచనలు భారతీయ చింతనకు బాగా దగ్గరగా ఉంటాయి.

క్రైస్తవ ప్రభావం నుంచి, ఫ్రాయిడ్ నుంచి, మార్క్స్ నుంచి బయల్దేరినవాడు ఎరిక్ ఫ్రామ్. పలపక్షం లేని తన అనుభవం గీటురాయిగా ప్రతి సిద్ధాంతాన్ని విలువగడుతూ ముందుకెళ్లాడు. భావవాదంలో కన్పించే కొన్ని అనుకూలాంశాల్ని కూడా సమన్వయ పరుచుకున్నాడు. వర్తమాన సంక్షుభిత సమాజానికి గొప్ప ప్రత్యామ్నాయం చూపించాడు. స్వేచ్ఛ, ప్రేమ, శ్రమ అనేవి అతని సిద్ధాంత మూలధాతువులు.

అతని గ్రంథాల్లో The Fear of Freedom (1947) మౌలికమైందని నా ఉద్దేశం. (ఆ పుస్తకం తొలిగా The Escape From Freedom పేరున 1941లో వెలువడింది) ఆ తర్వాత Sane Society (1955), The Art of Loving (1956), Beyond The Chains of Illusion (1962), To Have or To Be (1978) ముఖ్యమైనవి. అవి నాపై అత్యంత ప్రభావం ప్రసరించిన నేపథ్యంలో ఫ్రామ్ తత్వాన్ని వివరించటానికి ప్రయత్నిస్తాను.

## మానవ పరిణామం - స్వేచ్ఛ

మనిషి ఆవిర్భావంతో జీవం తనను గూర్చి తాను చైతన్యం పొందింది. మనిషి నిర్మాణంలో ఒక అంతర్గత వ్యవస్థ, కొన్ని సుస్థిర లక్షణాలు ఉన్నాయి. భౌతికంగా, శారీరకంగా పుట్టుకతో బలహీనుడైన మనిషి ఆత్మచైతన్యం, హేతువు, ఊహాశక్తులతో అభివృద్ధి చెందాడు. హేతువు అతనికి వరం, శాపం కూడా అయిందని Sane Society లో అంటాడు ఫ్రామ్. మనిషి పుట్టుకే ఒక వైరుధ్యం.

మాతృగర్భ బంధాన్నీ, ప్రాకృతిక సంబంధాన్నీ ప్రాథమిక బంధాలు (Primary Bonds)గా ఫ్రామ్ పేర్కొన్నాడు. తల్లి నుంచి వేరైన మనిషి తిరిగి మాతృగర్భం చేరలేడు. ఆదిమ కాలంలో ప్రకృతితో ఒక్కటిగా ఉన్నాడు మనిషి, ఆ తర్వాత ప్రకృతి నుంచి వేరుగా 'నేను' అనే చైతన్యం పొందాడు. తిరిగి ఆ చైతన్యం కోల్పోజాలడు. అంటే అతను తన ప్రాథమిక బంధాల నుంచి శాశ్వతంగా విడబడ్డాడు.

He has lost his original home, nature. (Sane Society)

మనిషి తనచుట్టూ ఆవరించిన ప్రకృతి నుంచీ, సాటి మనుషుల నుంచీ విడబడి, వ్యక్తిగా రూపొందటంతోనే సామాజిక చరిత్ర ప్రారంభమైందని ఫ్రామ్ అన్నాడు, The Fear of Freedom లో.

ఆదిమ కాలంలోగానీ, మధ్యయుగంలోగానీ మనిషి 'వ్యక్తి'గా బలపడలేదు. కనుక 'వ్యక్తి స్వేచ్ఛ' అనే భావన కూడా బలపడలేదు. అప్పుడు మనిషి దైవం చేతిలో మనిషి, సామాజికమైన కట్టుబాటులో

---

డాక్టర్ పాపినేని శివశంకర్ - ప్రముఖ కథానికా రచయిత, విమర్శకుడు. - గుంటూరు

భద్రంగా ఉన్న మనిషి, కనుక అతనికి ఉనికికి సంబంధించిన భయం లేదు. కానీ ఆధునిక సమాజంలో మనిషి వ్యక్తిగా రూపొందాడు. వ్యక్తి స్వేచ్ఛ పొందాడు. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ మనిషిని తనకు తానేకర్తగా, బాధ్యుడుగా చేసి వదిలేసింది. అతణ్ణి చివరికి వస్తువుగా మార్చింది. మానవ సంబంధాలు వస్తుసంబంధాలయ్యాయి. అవసరం, చెలామణీ లేకపోతే వస్తువుకు మల్లే మనిషికీ విలువ లేదు. ఈ క్రమంలో మనిషి తన ఉత్పత్తితోనేగా తన ఆత్మతోనూ వాస్తవ సంబంధం కోల్పోయాడు. ఇది పరాయితనం, మానవ శక్తియుక్తులు, ఉత్పాదనలు తమ సహజ స్వభావాన్ని కోల్పోవటమే పరాయితనం, మార్క్స్ తొలి రచనలు The Economic and Philosophical Manuscripts (1844) నుంచి ఈ భావనను గ్రహించిన ఫ్రామ్ దాని స్వభావాన్ని విపులంగా చర్చించాడు.

ఇట్లా ఆధునిక సమాజంలో మనిషి ఒకవైపు స్వతంత్రుడుగా ఉంటూనే మరోవైపు ఏకాకిగా, భయ పీడితుడుగా తయారవుతున్నాడు. ఈ అభద్రతను, విడితనాన్ని అధిగమించటానికై సంపద కోసం, అధికారం కోసం ఆరాటపడుతున్నాడు. ఇవేకాకుండా వ్యాపార విజయం, వినోదం, పరిచయాలు పెంచుకోవటం మొదలైన పద్ధతుల ద్వారా తన ఒంటరితనాన్ని, అభద్రతను తొలగించుకోవాలని చూస్తున్నాడు. ఈ పద్ధతులన్నీ ప్రతికూల స్వేచ్ఛ (Negative Freedom)లో భాగం.

సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులు మనిషి వ్యక్తిత్వ వాస్తవీకరణకి తగిన పునాది కల్పించనప్పుడు అతనికి స్వేచ్ఛ భారమవుతుంది, దాని నుంచి పలాయన మార్గాల కోసం అతను వెతుకుతాడు. అధికారత్వాన్ని ప్రదర్శించటం లేదా దానికి లొంగిపోవటం ఒక పలాయన మార్గం. ఈ మార్గంలో అతను తన బలం కోసం ఒక బాహ్యశక్తితో సంబంధం పెట్టుకుంటాడు. విధ్వంస తత్వం (Destructiveness) మరో పలాయన మార్గం, విధ్వంసం ద్వారా అతను అశక్తతను కప్పిపుచ్చుకుంటాడు. యాంత్రిక సంబద్ధత (Automation conformity) ఇంకో పలాయన మార్గం. ఈ మార్గంలో మనిషి తన వ్యక్తిత్వం కోల్పోయి సామాజిక సంస్కృతి ఏ వ్యక్తిత్వాన్ని నిర్దేశిస్తే దాన్ని స్వీకరిస్తాడు. చరిత్ర గమనంలో చర్చి (మతం), రాజ్యం, నైతిక జ్ఞానం, సామాన్య జనాభిప్రాయం ఇవన్నీ క్రమంగా ఒకదాని స్థానం మరొకటి ఆక్రమిస్తూ మనిషిలో వ్యక్తిత్వం తలెత్తకుండా సంబద్ధతను (Conformity) పోషిస్తూ వచ్చాయని ఫ్రామ్ అభిప్రాయం. ఆధునిక మానవుడు కుహనా అనుభూతుల్తో, రెడీమేడ్ ఆలోచనల్తో, చౌకబారు సెంటిమెంటాలిటీతో పతనమయ్యాడని అతను భావించాడు.

Modern man starved for life, (The Fear of Freedom)

నిజమైన జీవితానుభవం పొందటానికి ఏ మహాశక్తీ మనిషికి తోడ్పడబోదు. ఆ శక్తి అతనిలోంచి రావలసిందే. ఆత్మావలోకనమే అతనికి తోడు.

Know thyself is one of the fundamental commands that aims at human strength and happiness. (The Fear of Freedom)

మనిషి అస్తిత్వం, స్వేచ్ఛ - ఇవి రెండూ అవిభాజ్యాలని ఫ్రామ్ చెప్పాడు. 'స్వేచ్ఛ' అనే భావనలోనే అంతర్లీనంగా ఒక వైరుధ్యం ఉంది. ఆధునిక స్వేచ్ఛా మానవుడులో ఒక వంక స్వతంత్ర వ్యక్తిత్వం బలపడుతుంటే, మరో వంక ఒంటరితనం ఏర్పడుతుంది. ఈ వైరుధ్యాన్ని తాత్వికంగా పరిష్కరించటంలో ఎరిక్ ఫ్రామ్ సఫలుడయ్యాడు.

Man can be free and yet not alone (The Fear of Freedom)

మనిషి స్వతంత్రుడుగా ఉంటూనే మానవజాతిలో అవిభాజ్యమైన భాగంగా ఉండగలడని అతని నమ్మకం. ఈ స్వేచ్ఛను మనిషి తను 'తను'గా మనగలగటం ద్వారా, తన ఆత్మను వాస్తవీకరించుకోవటం

ద్వారా పొందగలడు. ఎటువంటి సంకోచాలు లేకుండా ఆత్మకు సంబంధించిన, ప్రపంచానికి సంబంధించిన సత్యాన్ని దర్శించగల మనిషే స్వేచ్ఛను పొందగలడు.

స్వేచ్ఛా భయపీడితుడైన ఆధునిక మానవుడికి స్వచ్ఛంద సంబంధం (Spontaneous Relation), లేదా స్వచ్ఛంద ఆచరణ (Spontaneous Activity) అనే పరిష్కారం సూచించాడు. ఎరిక్‌ఫ్రామ్. ఈ మాటను కారల్‌మార్క్స్ రచనలు The Economic and Philosophical Manuscripts (1844) నుంచే అతను గ్రహించినట్లు తెలుస్తుంది. Spontaneity అనే మాట యొక్క మూల ధాతువు 'Sponte' 'స్వతంత్ర సంకల్పాన్ని' తెలియజేస్తుంది. ఈ స్వాభావిక లేదా స్వచ్ఛంద సంబంధం యొక్క వ్యక్తీకరణలు 1. ప్రేమ. 2. పని (శ్రమ). ప్రేమ మనిషి ఏకాకి తనాన్ని పోగొడుతుంది. పని ద్వారా మనిషి తిరిగి ప్రకృతితో మమేకం కాగల ఈ సృజనాత్మక ప్రక్రియలద్వారా మనిషి తనతో, ఇతరుల్తో, ప్రపంచంతో సరికొత్త సంబంధం పెట్టుకుంటాడు. ఇవి మనిషి వ్యక్తిత్వాన్ని తొలగించకుండా అతని పరాయితనాన్ని మాత్రమే తొలగిస్తాయి. ఫ్రామ్ చెప్పిన సృజనాత్మకమైన శ్రమ క్రమం ప్రకృతి నుంచి మనిషి పరాయితనాన్ని తొలగిస్తుంది. ప్రేమ సమాజం నుంచి అతని పరాయితనాన్ని తొలగిస్తుంది. అంతిమంగా స్వేచ్ఛ ఆత్మ పరాయితనాన్ని తొలగిస్తుంది. మానవ అస్తిత్వ సమస్యను పరిష్కరించటంలో ఇది మహోన్నతమైన తాత్విక ప్రతిపాదన.

## రెండు రకాల జీవన విధానాలు

వర్తమాన సంక్షుభిత సమాజంలో రెండు రకాల జీవన విధానాలు సంఘర్షిస్తున్నట్టు సామాజిక మనస్తత్వవేత్త ఫ్రామ్ చెప్పాడు. మార్క్స్ తొలి రచనల్లోంచి వాటి మూలాలు గ్రహించి, విస్తరించి చెప్పాడు. 1. సంగ్రాహక జీవన విధానం (Having mode of life):

దురాశ, దురుసుతనం, అసూయ చోదక శక్తులుగా సాగే ఈ జీవన విధానంలో భౌతిక సంపద పొందటం, అనుభవించటం, లాభం ఆర్జించటం ఉంటాయి. కలిగి వుండటమే జీవన పరమార్థమవుతుంది.

Iam = What I have and what I consume (To Have or To Be)

ఇది చివరికి Iam the more I have అనే పరిస్థితికి దారి తీస్తుంది. మనిషికీ వస్తువుకీ మధ్య సజీవ సంబంధం నశిస్తుంది. కర్త (మనిషి) కర్మ (వస్తువు) అవుతాడు, కర్మ కర్త అవుతుంది. అంటే సంపదే మనిషిని కలిగి వుండే పరిస్థితి ఏర్పడుతుంది. My property constitutes my self and my identify. (To Have or To Be)

ఈ జీవన విధానం వ్యక్తిగత ఆస్తి స్వభావం నుంచే ఉత్పన్నమైందని ఫ్రామ్ గుర్తించాడు. దీనిని బుద్ధుడు చెప్పిన 'తృష్ణ'తో పోల్చటం గమనించదగ్గ అంశం.

మితిమీరిన కోరిక దుఃఖానికి దారితీస్తుంది. నేను కలిగి వున్నదే 'నేను' అయినప్పుడు, ఆ కలిగివున్నది నశిస్తే 'నేను' నశించినట్టే. భౌతిక సంపద నశ్వరం గనుక దానిని వెన్నంటే నాశన భయం ఉంటుంది. కనుక సంగ్రాహక జీవన విధాన ముఖ్య లక్షణం అభద్రత. దాని ఫలితం భయం.

ప్రకృతిపై ఆధిపత్యంతో మనిషికి గొప్ప స్వేచ్ఛ లభిస్తుందనీ, అంతులేని అభివృద్ధి జరుగుతుందనీ, అధిక సంపద మనిషికి అధిక సంతోషం ఇస్తుందనీ పారిశ్రామిక యుగం చేసిన గొప్ప వాగ్దానం సంగ్రాహక జీవన విధానంతో విఫలమైందనీ ఫ్రామ్ వ్యాఖ్యానించాడు. 2. సంస్థిత జీవన విధానం (Being mode of life): ఈ జీవన విధానానికి స్వేచ్ఛ ఎంతగానో అవసరం. అంతర్గత ఆచరణశీలం అవసరం. అంటే మానవ శక్తుల్ని సృజనాత్మకంగా ఉపయోగించగలిగి వుండాలి. అహాన్ని అధిగమించాలి. ఈ విధానంలో

మనిషి అంతర్దృష్టితో తనగురించి, ఇతరుల గురించి సత్యాన్ని ఉన్నది ఉన్నట్టుగా దర్శిస్తాడు. కాలం ఈ విధానాన్ని శాసించదు. 'ఇప్పుడు', 'ఇక్కడ' అనేవే ఈ విధానంలో ఉంటాయి.

స్వచ్ఛంద ఆచరణ (Spontaneous activity) ఈ జీవన విధానంలో ముఖ్యం. (ఈ మాటనే Productive activity అని ఎరిక్ ఫ్రామ్ To Have or To Be అనే పుస్తకంలోనూ, ఇతర రచనల్లోనూ అన్నాడు.) ప్రేమ, శ్రమ కలగలసిన ఈ ఆచరణ (లేదా క్రియ) పరాయితనం పొందని ఆచరణ. అంటే మనిషి మనఃపూర్వకంగా చేసే ఆచరణ.

In non-alienated activity, I experience myself as the subject of my activity. (To Have or To Be)

సంస్థిత జీవన విధానంలో మనిషి తను సృష్టించిన సంపదను ఇతరులతో పంచుకుంటాడు. త్యాగం చేస్తాడు. సంతోషం దీని పరమావధి.

Joy is the concomitant of the productive activity. (To Have or To Be)

బౌద్ధమతంలో చెప్పిన నిర్వాణ స్థితి ఇదేనని ఫ్రామ్ భావించాడు.

## ప్రేమ లక్షణం

మనిషి అస్తిత్వ సమస్యకి ప్రేమే సమాధానమని ఎరిక్‌ఫ్రామ్ సిద్ధాంతీకరించాడు.

Love is the answer to the problem of human existence. (The Arty of Loving)

ప్రేమను స్వేచ్ఛా శిశువుగా దర్శించాడు. అతని దృష్టిలో ప్రేమ ఒక శక్తి. ప్రేమ ద్వారా మనిషి తనలోని సజీవాంశను ఇతరులకు అందిస్తాడు. వారిలో తిరిగి ప్రేమ మొలకెత్తుతుంది. అంటే అది సృజనాత్మకమైన శక్తి.

ప్రేమ అంటే కేవలం ఇద్దరు వ్యక్తుల మధ్య సంబంధం కాదనీ, అది మనిషికీ ప్రపంచానికీ ఉండే సంబంధం అనీ అతని అవగాహన. ప్రేమ అనే భావనకు విశాలార్థం కల్పించాడు ఫ్రామ్. అందులో జాగ్రత్త, బాధ్యత, గౌరవం, జ్ఞానం ఇమిడి వుంటాయి.

ప్రేమలో 1. మాతృప్రేమ, 2. సోదర ప్రేమ, 3. లైంగికప్రేమ, 4. స్వీయప్రేమ, 5. దైవప్రేమ అనే రకాలను ఫ్రామ్ పేర్కొన్నాడు.

ప్రేమను అభ్యసించవచ్చని భావించిన ఫ్రామ్ అందుకు మన మనస్సులో క్రమశిక్షణ, ఏకాగ్రత, ఓర్పు, శ్రద్ధ, వస్తుగత దృష్టి, నమ్మకం, ఆచరణ శీలం ఉండాలన్నాడు.

## ఆశావాదం

ఫ్రామ్ తత్వంలో ఎక్కడా నిరాశాచ్ఛాయలుండవు. మనిషి అభివృద్ధిలో 'ఆశ' అనేది అపరిహార్యమైన మూలద్రవ్యంగా అతను గ్రహించాడు.

Hope is the psychic concomitant to life and growth. (The Revolution of Hope)

ఆశ అనేది విశ్వాసంలో భాగమన్నాడు ఫ్రామ్. ఆశ లేదా విశ్వాసం అంటే భవిష్యత్తు గురించి ఊహాగానం కాదు. అది గర్భందాల్చిన వర్తమానాన్ని దర్శించటమే. అంటే వర్తమాన సంఘర్షణను పరిశీలిస్తూ అందులో భవిష్యత్ పరిణామాల కదలికల్ని గుర్తించటం. దీనివల్ల మనస్సు చైతన్యవంతమవుతుంది. అందుకే ఫ్రామ్ ఆశను అంతరంగ సంసిద్ధంగా (Inner readiness) వర్ణించాడు.

## మార్క్స్‌ను, ఫ్రాయిడ్‌నూ కలుపుతూ

మొదటి ప్రపంచ యుద్ధ ప్రభావం ఫ్రామ్ రచనల నేపథ్యంలో ఉంది. శాంతియుత జీవనానికి విరుద్ధంగా కోట్లమంది ప్రజలు ఎందుకు పరస్పర హననానికి పాల్పడ్డారో అతని కర్థం కాలేదు. క్రమంగా ప్రతి సిద్ధాంతాన్నీ శంకించే స్వభావం ఏర్పడింది.

వ్యక్తికీ, సమాజానికీ సంబంధించిన కొన్ని ప్రశ్నలకు ఫ్రాయిడ్, మార్క్స్ సిద్ధాంతాల్లో తనకు సమాధానాలు దొరికాయని ఫ్రామ్ Beyond the Chains of Illusion లో చెప్పాడు. ఆ రెండు సిద్ధాంతాల్ని కలుపుతూ ఒక సంశ్లేషణ (Synthesis) తాను చెయ్యగలిగినట్టు కూడా చెప్పుకున్నాడు.

ఐన్‌స్టీన్, మార్క్స్, ఫ్రాయిడ్ ఆధునిక యుగ నిర్మాతలని ఫ్రామ్ ప్రశంసించాడు. మార్క్స్ ఫ్రాయిడ్ కన్నా ఎంతో లోతు, విరివి గల ఆలోచనా పరుడుగా అతనికి గోచరించాడు. Marx is a figure of world historical significance. (Beyond the Chains of Illusion) అతని దృష్టిలో ఫ్రాయిడ్ ఉదారవాద సంస్కర్త; మార్క్స్ రాడికల్ విప్లవ కారుడు. ఫ్రాయిడ్ సంశయవాది; మార్క్స్ ఆశావాది.

మానవతా దృక్పథం గల గొప్ప సిద్ధాంతంగా మార్క్సిజాన్ని అంగీకరిస్తూనే మార్క్స్ ఆలోచనలో కొన్ని పొరపాట్లు ఉన్నాయన్నాడు ఫ్రామ్. మనిషిలోని నైతిక పార్శ్వాన్ని నిర్లక్ష్యం చెయ్యటం అందులో ఒకటి. కమ్యూనిజం రూపంలో రాగల ప్రమాదాలను ఊహించలేకపోవటం రెండోది. ఉత్పత్తి సాధనాలను సమాజపరం చెయ్యటంతోనే పెట్టుబడిదారీ వ్యవస్థ సోషలిస్టు వ్యవస్థగా మారుతుందనే భావన మూడోది. (Sane Society)

ఫ్రాయిడ్ దృష్టిలో మనిషి ప్రాథమికంగా విడిమనిషి, స్వాధీనుడు, ఒక Closed System. సమాజ వ్యతిరేకి. అతనిలో ఎప్పుడూ చెడు స్వభావం దాగి వుంటుంది. ప్రకృతి సహజంగా కొన్ని మానసిక (లైంగిక) వాంఛలుంటాయి. అవి తీరటం, తీరకపోవటం అనేదాన్ని బట్టి అతని వ్యక్తిత్వం ఏర్పడుతుంది. లైంగిక వాంఛను (Libildo) జీవిత చోదకశక్తిగా పరిగణించాడు ఫ్రాయిడ్. ప్రేమకూడా అతని దృష్టిలో ఒక లైంగిక విషయమే. లైంగిక సంతృప్తిని స్వాభావికమైన సంతోషంగా అతను భావించలేదు. బాధాకరమైన ఒత్తిడినుంచి విడమరగానే భావించాడు. అతనిపై పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రభావం ఉంది. ఈ విధమైన విశ్లేషణతో ఎరిక్ ఫ్రామ్ సూటిగా అతణ్ణి వ్యాఖ్యానించాడు.

Frend's psychology is a psychology of want. (The Fear of Freedom)

ఫ్రామ్ అవగాహనలో మానవుడు సామాజిక జీవి. వ్యక్తి మనస్తత్వం సామాజిక సంబంధాల్లోంచే రూపొందుతుందనే అతని నిర్ధారణ మార్క్స్ పరిశీలనకు సన్నిహితమైంది. Biologically fixed human nature లేదని అతని నమ్మకం. మనిషి స్వభావం, ఆవేశకావేషాలు అన్నీ ఒక సాంస్కృతిక ఉత్పత్తిగా భావించాడతను. సామాజిక సంబంధాల్లోంచి రూపొందిన మనిషి వ్యక్తిత్వం తిరిగి సమాజాన్ని ప్రభావితం చేస్తుంది. ఈ గతితార్కిక ప్రక్రియని ఫ్రామ్ గమనించాడు. మనిషినే గాక విభిన్న సమాజాలకు కూడా విభిన్న వ్యక్తిత్వాలుంటాయన్నాడు. అవి కూడా కొత్త కొత్త అవసరాల్ని బట్టి ఎల్లప్పుడూ మారుతుంటాయి. ఈ అవగాహనా క్రమంలో ఎరిక్‌ఫ్రామ్ ఒక విలువైన మాటన్నాడు.

Man is not only made by history; history is made by man. (The Fear of Freedom)

ఈ అవగాహననే Marx's Concept of Man లోనూ ప్రకటించాడు. అనేకానేక చోదక శక్తులవల్ల మనిషి ఏర్పడ్డాడు. మనిషే చోదకశక్తిగా చరిత్ర ఏర్పడింది. మానవుడు చారిత్రక నిర్మాణం; చరిత్ర

మానవ నిర్మాణం, ఈ విధంగా మానవ పరిణామంలోని పరాధీనత, స్వాధీనత అనే ద్విముఖ లక్షణాన్ని ఫ్రామ్ సరిగ్గా గుర్తించాడు.

## నూతన సమాజం - నూతన మానవుడు

ఎరిక్‌ఫ్రామ్ తన సామాజిక విశ్వాసాలను Beyond The Chains of Illusion అనే గ్రంథంలో Credo అనే శీర్షికతో ఎంతో స్పష్టంగా ప్రకటించాడు.

I believe that man is the product of natural evolution; that he is part of nature and yet transcends it, being endowed with reason and self - awareness.

తనలోని మానవ శక్తుల వికాసం ద్వారా మనిషి తిరిగి సాటి మనుషులకీ, ప్రకృతికీ దగ్గర కాగలడని అతని విశ్వాసం. మానవ ఖేదానికి అర్థం ఏమిటి అనే ప్రశ్నకు మాత్రం ఫ్రామ్ దగ్గర సమాధానం లేదు. ఉన్నది ఉన్నట్టుగా, ఏ భ్రమలూ లేకుండా జీవితాన్ని స్వీకరించి ఒక స్వేచ్ఛామార్గం అన్వేషించటమే మనిషి చెయ్యాల్సింది. ఏ మనిషీ మరొకడిని ఉద్ధరించలేడు. అయితే ప్రేమగా, సత్యస్ఫోరకంగా ప్రత్యామ్నాయ మార్గాలు సూచించగలడు. వ్యక్తివికాసంలో నిర్దిష్ట సామాజిక రూపం, విలువలు ముఖ్య పాత్ర వహిస్తాయి. ఎన్ని భేదాలున్నా మానవ జాతి ఒకటే. అందరూ ఋషులే. అందరూ పాపులే. ఎవరూ మరొకరికన్న ఎక్కువ కాదు. తన వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటూనే అహాన్ని అధిగమించి, విశ్వజనీనత్వాన్ని మనిషి సాధించాలి. అతనికి హేతువుతో పాటు ఆశ, విశ్వాసం అవసరం. స్వతంత్ర వ్యక్తిగా మనగలిగే స్వేచ్ఛ అవసరం, మనిషి పరిపూర్ణుడు కాగలడు.

పెట్టుబడిదారీ, సోషలిస్టు సమాజాలు రెండింటిలోనూ ఉన్న అవలక్షణాల్ని ఫ్రామ్ ఖండించాడు. అందరికీ పని, ప్రజల చురుకైన పాత్ర,

వినియోగం కోసం ఉత్పత్తి, ఆర్థిక వికేంద్రీకరణ, మానవతా దృక్పథంగల అధికారం మొదలైన అంశాలతో సరికొత్త సమాజం ఏర్పడాలని ఫ్రామ్ ఆశించాడు. To Have or To Be అనే గ్రంథంలో నూతన మానవ వ్యక్తిత్వ వికాసానికి అవసరమైన జ్ఞాన సూత్రాల్ని చెప్పాడు.

1. మనం బాధపడుతున్నామనే స్పృహ కలిగి వుండటం
2. అస్వస్థ జీవనానికి మూలం ఏమిటో గుర్తించటం
3. అస్వస్థ జీవన విధానాన్ని అధిగమించగలమని తెలుసుకోవటం
4. అస్వస్థ జీవన విధానాన్ని అధిగమించటానికి నిర్దిష్ట జీవన సూత్రాలు పాటించటం.

ఈ నాలుగు అంశాలు బుద్ధుడు కనుగొన్న చతురార్య సత్యాలను పోలి వుంటాయని ఫ్రామ్ చెప్పాడు. నూతన మానవుడి కుండాల్సిన వ్యక్తిత్వ లక్షణాలు కూడా వివరించాడు. సంగ్రాహక స్వభావాన్ని వదులుకోవటం, విశ్వాసంపై ఆధారపడిన భద్రతాభావం, మౌలిక స్వాతంత్ర్యం, పూర్తి నిమగ్నత, సంతోషం, ప్రేమ, దురాశాద్వేషాల తృణీకరణ, విగ్రహా, స్వీయారాధనలకు స్వస్తి చెప్పటం, ఊహాశక్తిని పెంచుకోవటం, సంపూర్ణ ఆత్మవికాసం, ప్రకృతితో సహజీవనం మొదలైనవి ఆ లక్షణాలు.

Life is a unique gift and challenge (Sane Society) అని భావించిన ఎరిక్ ఫ్రామ్ నిసర్గ జీవితమే జీవన సార్థకత అన్నాడు. ఛామ్‌స్కీ అన్నట్టు అతను క్రూర ప్రపంచంలో చిక్కుకున్న వ్యక్తుల గురించి వివేకంతో, విజ్ఞానంతో, కరుణతో కొన్ని మాటలు చెప్పాడు. వాటిని స్వచ్ఛమైన అంతరాత్మతో ఆలకించటమే మన పని.

# ఆధునిక హీబ్రూ ప్రవక్త ఎరిక్ ఫ్రామ్

- చినవీరభద్రుడు

మాఘ మాసపు రాయలసీమ. హార్స్‌లీ కొండపైన బంగారు వాకిలి తెర్చుకున్నట్లుగా సూర్యుని ప్రభాతకాంతి. ఎదుట లాన్‌లో పువ్వులు వికసించి వున్నాయి. ఆరోగ్యవంతమైన, ఆశావహమైన ఒక కొత్తరోజు ప్రారంభమవుతోందని నన్ను నేను మెలకువ పర్చుకుంటుండగా ఎరిక్‌ఫ్రామ్ వాక్యాలు గుర్తువచ్చాయి.

The Sane Society (Henry Holt and Company, New York, 1990)లో పే 149-150 లో ఆ వాక్యాలు ఇలా ఉన్నాయి:

''ఇప్పుడు ఆధునిక మానవుడి మనసులో ఒక కొత్త ప్రశ్న తలెత్తింది. 'జీవితం జీవించ దగ్గదేనా?' అన్నదే ఆ ప్రశ్న. దాని వెంటనే జీవితం ఒక వైఫల్యం లేదా ఒక విజయం అనే భావన. ఈ అభిప్రాయం జీవితం ఒక లావాదేవీ, అది తప్పనిసరిగా ఎంతో కొంత లాభాన్ని చూపించాలి అన్న వుద్దేశ్యం మీద అధారపడ్డది. అది విఫలం కావడమంటే ఆ వ్యాపారమేదో దివాలా తీసినట్లు, లాభాల కంటే నష్టాలు అధికమయినట్టూ. అసలు ఈ అభిప్రాయమే అర్థరహితం మనం సంతోషంగా ఉండవచ్చుగాక, ఉండక పోవచ్చుగాక, కొన్ని లక్ష్యాల్ని సాధించవచ్చు గాక, సాధించక పోవచ్చుగాక, అయినప్పటికీ ఈ వ్యవహారాన్ని తూచ గలిగే సున్నితమయిన త్రాసు ఏదీ లేదు. జీవితం జీవించదగ్గదో కాదో చెప్పగల తూకపు రాళ్లు లేవు. ఒక విధంగా చెప్పాలంటే ఏదన్నా ఒక లాభసాటి మిగులు దృష్ట్యా ఆలోచిస్తే జీవితం ఏ జీవిత కాలంలో నయినా నిరర్థకమైందే కావొచ్చు. జీవితం తప్పని సరిగా మృత్యువులోనే ముగుస్తుంది. మన ఎన్నో ఆశలు రాలిపోయి వుండవచ్చు. దాని పొడుగునా వేసట, వేదన, బహుశా ఏదన్నా ఒక లాభార్జన దృష్ట్యా చూసినట్లయితే అసలు మనం పుట్టకపోయి వుంటేనో, లేదా పుట్టిన వెను వెంటనే గిట్టి వుంటేనో ఎక్కువ అర్థవంతంగా వుండి వుండవచ్చు. కాని ఇదిలా వుండగా, ఎవరు చెప్పగలరు - ఒక ప్రేమ భరిత మధుర క్షణం, హాయిగా గుండెల నిండా గాలి పీల్చుకున్న సంతోషం, ప్రకాశవంతమయిన ఒక ప్రభాతవేళ వ్యాహ్యాళి, ప్రత్యూష పవనాలు ఒక జీవిత కాలపు వేదనకూ, వేసటకూ సాటిరావని? జీవితం ఒక అద్వితీయ కాన్క, సవాలు, దీన్ని మరే తూకపు రాళ్ళతోనూ కొలవలేం, జీవితం జీవించదగ్గదేనా అన్న ప్రశ్నకు సమంజసమైన సమాధానం ఏమీ ఇవ్వలేం, ఏమంటే ఆ ప్రశ్నే సమంజసం కాదు కనుక.''

పరిపూర్ణమైన ఆ ప్రభాత వేళ ఫ్రామ్ వాక్యాలు నాకు మహనీయులైన భారతీయ సాధు సత్పురుషులు రాసిన వాక్యాల్లాగా అన్పించాయి. ఎవరు అన్నారో పేర్లు విడివిడిగా ఇవ్వకపోతే ఈ కింది వాక్యాలనూ, ఫ్రామ్ వాక్యాలనూ విడదీసి చూపడం కష్టం.

మొదట కృష్ణ మూర్తి, హార్స్‌లీ దగ్గర్లో మదనపల్లిలో ఆయన ఫ్రామ్‌కి సమకాలీనుడుగా ఇలా అంటున్నాడు: ''ఆశయమనేది ఏ రూపంలోనన్నా కానివ్వు- అది సమూహానికిగానీ, వ్యక్తిగత విముక్తికి గానీ, ఆధ్యాత్మిక సాధనకి గానీ - కర్తవ్యాన్ని వాయిదా వెయ్యడమే. కోరిక అనేది ఎప్పటికీ భవిష్యత్తుకి చెందిన విషయం, ఏదన్నా ఒకటి కావాలని కోరుకోవడమనేది వర్తమానానికి చెందినంత వరకూ ఏమీ

---

వి. చిన వీరభద్రుడు, హైదరాబాద్, గిరిజన సంక్షేమశాఖలో ప్రత్యేక అధికారిగా పని చేస్తున్నారు.

కాకుండా వుండటమే. నిజానికి రేపటి కంటేనేడే ఎంతో మిన్న. 'ఇప్పుడు' ని అర్థం చేసుకోవడమంటే కాలం బంధాల నుంచి తప్పించుకోవడమే. ఏదన్నా ఒకటి కావడమనేది కాలాన్ని కొనసాగించడం, వేదనని కొనసాగించడం, ఆ 'కావడం'లో 'ఉండటం' లేదు. ఉండట మనేది వర్తమానానికి చెందినది. అత్యంత విశిష్ట పరివర్తన అది. కాగా 'కావటమనేదే కొనసాగింపు ఏదో ఒక రూపంలో కొనసాగడమే. నిజమయిన పరివర్తన అనేది ఇప్పుడే, ఇక్కడే ఉండడంలో వుంది'' (కామెంటరీస్ ఆన్ లివింగ్, ఫస్ట్ సిరీస్ 1991 పే.3)

ఆధునిక జీవితంలోని ఈ ప్రయోజన వాదాల, ఆశయ వాదాల పరమితుల గురించి భారతీయ దార్శనికులు ఇరవయవ శతాబ్దపు తొలి రోజుల్లోనే హెచ్చరించారు. డా॥ రాధాకృష్ణన్ తన "An Idealist View of Life" (1932) లో ఇలా అంటున్నాడు :

''ప్రపంచ చరిత్రలో ఏ యుగమయినా ఒక పరివర్తనకు లోనవుతున్నట్లుగా భావించడం ఇదే మొదటి సారికాదు. ఎంతవరకు నిజమో చెప్పలేను గాని ఈడెన్ ఉద్యానం నుండి బయటకు అడుగు పెడుతుండగా ఏడమ్ ఈవ్‌తో అన్నాడుట ''మనం పరివర్తన సంధ్యలో జీవిస్తున్నాం'' అని. ప్రతి యుగమూ ఒక పరిణామ శీల యుగమే. సంఘర్షణ, సంక్షోభాల్లోనే ప్రగతి ఉన్నది. అది సంభవిచండం ఉప మానవ దశలో, కాని దాన్ని గుర్తించడం మానవ చైతన్యంతోనే. ఈ ప్రగతి దిశని నిర్ధారించేది మానవ ఆత్మశక్తి... మానవత్వం అణచి వేత నుండి స్వేచ్ఛా శక్తివైపు, పరిపూర్ణ స్వయం నిర్ణాయకత్వం వైపు ప్రయాణించడానికి నలుగులాట పడుతున్న ఈ వేళ మనకి సృజనశీల మనస్సుల సహాయం కావాలి. పూజారుల మనసులు కావు, ప్రవక్తల ఆత్మలు కావాలి. సంక్రమించిన అలవాట్లను యథాతథంగా అనుకరించే యాంత్రిక బుద్ధులు కాదు. అవగాహనా శీలురైన, అసలయిన మనుషులు కావాలి. గమ్య రహితంగా తిరుగుతున్న మన తరానికి గమ్య నిర్దేశం చేయగలిగిన వాళ్ళు కావాలి. ప్రవచనమనేది అంతర్దృష్టి. అది దర్శనం. అది ఆగామి అనుభవం. అది వర్తమానాన్ని పరిపూర్ణంగా అవలోకించడం, తద్వారా భవిష్యత్తుని సందర్శించడం.'' (పే.39)

ఫ్రామ్ తన ఆలోచనలు ప్రపంచంలో దివ్య దర్శనాల్ని ప్రవచించిన ప్రవక్తల నుండి రూపొందించుకున్నవే అని చెప్పినప్పటికీ మహనీయులయిన యూదు తాత్త్వికులకే ఆయన ఎక్కువ ఋణపడివున్నాడు. ఇషయ్యా, స్పినోజా, ఫ్రాయిడ్‌ల ఆలోచన ఆయనలో ఒక విశిష్టమయిన రూపంలో పునరావిష్కృతమయింది. ఈ ఆలోచనలో ఆయన తన యూదు పూర్వీకుల పాదులో వుండి మాటాడుతున్నప్పటికీ, సనాతనమయిన ఆసియా వాణికి, భారతీయ వాణికి కూడా ఎంతో సన్నిహితుడిగా విన్పిస్తుండటమే నన్నెంతో ఆకట్టుకుంది.

ప్రతి ప్రవక్తా పూజారులపైన ఆగ్రహించిన వాడే. పూజారులు జీవన వ్యాసంగాన్ని యాంత్రికం చేస్తారు. ఈ రొటీన్ పైనా, రిట్యుయల్ పైనా ప్రకటించే అసమ్మతి లౌకిక భాషలో విన్పించినా, పారలౌకిక భాషలో విన్పించినా అవి జీవిత కార్యకలాపాన్ని సజీవంగా వుంచుకోవడం కోసం, సామూహిక కార్య కలాపాన్ని ఒక నిత్య కళ్యాణం - పచ్చతోరణంగా నిలుపు కోవడం కోసం అన్నది మనం గమనించాలి. ఈ అర్థంలో లౌకిక పరిభాషకీ, మత పరిభాషకీ భేదం లేదు. ఆసక్తి కలిగించే తన వ్యాసం 'Psycho analysis and Religion' లో ఫ్రామ్ దీన్నే స్పష్టంగా వివరించేడు. ఇదే ఫ్రామ్

ఆలోచనలోని ఆల్కెమో. ఒకవైపు ఆయన సెక్యులర్ తత్త్వవేత్తల హేతువుని మిస్టిక్‌ల, సాధువుల విశ్వాసంతో మేళవిస్తాడు. మరొకవైపు ఈ మేళవింపుకి ఇరువురి ఆలోచనలోని ఆరోగ్యవంతమయిన జీవన దృక్పథాన్ని ప్రాతిపదికగా చూపిస్తాడు. నిజానికి ఈ రసవేదం స్పినోజాదే. తన సర్వశ్రేష్ఠ రచన 'ఎథిక్స్' (1666) ని ముగిస్తూ ఆయన రాసిన ఈ వాక్యాల్లో ఫ్రామ్ ఆలోచన బీజ ప్రాయంగా కన్పిస్తుంది.

''..... ఇంత వరకూ చెప్పిన దాన్ని బట్టి ఒక వివేకవంతుడి సత్వం ఎటువంటిదో మనం చూడవచ్చు. అతడు అవివేక మానవుడి కాంక్షాపరత్వాన్ని ఏ విధంగా దాటి పోగలుగుతున్నదీ కూడా చూడవచ్చు. ఏమంటే అవివేకి, బయటి సంభవాల వల్ల సంచలిస్తూ వుండటమే కాకుండా, ఆత్మలోని నిజమయిన శాంతిని అనుభవించ లేకుండా, దైవం గురించీ, వివిధ విషయాల గురించీ కూడా ఎరుక లేకుండా అజ్ఞానంలో మగ్గుతుంటాడు. తన నలుగులాటతో పాటే అతడూ నశించి పోతాడు. మరొకవైపు వివేకి తన మనఃస్థితిలో ఏ విధమయిన తొట్రుపాటు లేకుండా, తన యొక్కా, దైవం యొక్కా, వస్తువుల యొక్క శాశ్వత ఆవశ్యకత పట్ల ఒక ఎరుకతో నిజమయిన మనశ్శాంతిని అనుభవిస్తూ నాశరహితుడిగా వుంటాడు. ఈ మార్గం దుర్లభమైనా అసాధ్యం మాత్రం కాదు. ఒకవేళ అది సులభమే అయివుంటే దాదాపు అందరూ దాన్ని నిర్లక్ష్యం చేసే పరిస్థితి ఎందుకుంటుంది? కాని మహనీయమయినవన్నీ అరుదు కాబట్టే దుర్లభాలు.''

తన మనః స్థితిలో తొట్రుపాటు లేకుండా ఉండటమే వివేకమని స్పినోజా చెప్పిన మాటల్ని మాండూక్యోపనిషత్, భగవద్గీత, ధమ్మపదాలతో పోల్చి చూడటం ఆసక్తికరంగా ఉంటుంది.

ఈ మనః స్థితినే బౌద్ధులు ప్రజ్ఞ అన్నారు. ఈ ప్రజ్ఞలో నిశ్చలంగా ఉండటాన్నే భగవద్గీత స్థిత ప్రజ్ఞత్వమంది. ఫ్రామ్ చెప్తున్న స్పష్ట చిత్తం ఈ స్థిత ప్రజ్ఞత్వానికి ఇరవయ్యవ శతాబ్దపు పర్యాయ పదమనడం సమంజసంగా ఉంటుంది. స్పినోజా వివేకమని చెప్తున్నది గ్రీకుల హేతుబద్ధతా, హీబ్రూ ప్రవక్తల సత్యసంధతా ఏకీభవించే ఒక విశిష్ట ఆత్మిక లక్షణం. స్పినోజా గురించి రాస్తూ విల్ డ్యురాంట్ ఇలా అన్నాడు :

''... కోరికల స్తబ్ధత్వమే మానవ దాస్యం. హేతుబద్ధత యొక్క క్రియాశీలత్వమే మానవ స్వాతంత్ర్యం. ఈ స్వేచ్ఛ కార్య కారణ సంబంధం నుంచో, కార్య కలాపం నుంచో కాదు. ఇది పాక్షిక అభిలాషల నుంచీ, ఉద్వేగాల నుంచీ స్వేచ్ఛ. ఇది వాంఛితాల పట్ల మోహం నుంచి స్వేచ్ఛ కాదు. అతృప్త, అసంయమిత వాంఛల నుండి స్వేచ్ఛ. మనం ఏ మేరకు తెలుసుకోగలమో ఆ మేరకే ముక్తులం కాగలం. మహామానవుడు కావడమంటే సామాజిక న్యాయ నిబంధనల నుండీ, క్షమాశీలత్వం నుండీ విడివడటం కాదు. సహజాతాల సంకుచితత్వం నుండి బయట పడటం. ఈ పరిపూర్ణత్వం నుండీ, సత్య సంధతనుండే వివేక వంతుడి సమదృష్టి సాధ్యపడుతుంది. ఇది అరిస్టాటిల్ వూహించిన కులీన మానవుని స్వీయ ఔద్ధత్యం కాదు, లేదా నీచీ భావించిన ఆదర్శ మానవుడి గరిష్టతా కాదు. అంతకు మించిన సమత్వ భావమూ మానసిక శాంతీను. మనుషులు తమ వివేకం చెప్పినట్లు నడుచు కోవడంలో తమకి ఏది ఉపయోగకరమో దాన్ని ఎంచుకుంటారు. ఇతర మానవాళి కోసం తాము ఏది అభిలషించలేరో అది తమకోసం కూడా కోరుకోలేరు. ఘనులుగా ఉండటమంటే తక్కిన మనుషుల

కన్నా అధికంగా వుండి వాళ్ళని శాసించడం కాదు. అది తమ అవ్యక్త వాంఛల నిష్ఫలత్వాల నుంచీ, పాక్షికత నుంచీ పక్కకి జరగడం, తనని తాను అదుపులో పెట్టుకోవడం'' (ది స్టోరీ ఆఫ్ ఫిలాసఫీ, 1926 పే. 185)

ఫ్రామ్ ఆర్థిక - మానసిక విశ్లేషణ పరిభాషలో వివరిస్తూ వచ్చిందంతా పై వాక్యాలను మరింత విస్తరించడమే. ఈ అవగాహనను సూత్రీకరిస్తే స్పినోజా వాక్యాలుగా మనం గుర్తుతెచ్చుకోవాల్సి వుంటుంది.

''... మొదటి తరహా కోరికల్ని చర్యలనీ, రెండవ తరహా కోరికల్ని వాంఛలనీ అనుకుందాం. మొదటి తరహా కోరికలు, అంటే మన కార్యాలు మన శక్తిని సూచిస్తే రెండో తరహావి మన అశక్తతనీ, అసమగ్ర జ్ఞానాన్నీ తెలియ చేస్తాయి.'' (ఎథిక్స్, అయిదవ భాగం, అనుబంధం. 2)

స్పినోజా చర్యలనీ, కార్యాలనీ వేటిని అంటున్నాడో దాన్నే ఫ్రామ్ ఉత్పాదక ప్రేమగా వివరిస్తాడు. ఈ ఉత్పాదక ప్రేమ కాముక ప్రేమకన్నా, మాతృత్వ ప్రేమకన్నా, మమకారం కన్నా భిన్నమయింది. ఒక విధంగా దీన్ని సౌభ్రాతృత్వం అనవచ్చు. కానీ సౌభ్రాతృత్వం కన్నా ఇది మరింత క్రియాశీల మయింది. దీని చోదక శక్తి హేతు బద్ధత. కాని అనార్ద్రం కాదు. గొప్ప మత ప్రవచనల్లో కన్పించే మనుషుల్ని ఒక్కటి చేసిన ఆత్మీయ శక్తిని ఇది మళ్ళీ ఆవాహన చేస్తుంది. ఈ వాక్యాలు చూడండి, ఇవి చదువుతున్నప్పుడు మౌఢ్యం లేని మత వాక్యాల్లా అన్పించడంలో ఆశ్చర్యం లేదు. ఫ్రామ్ రాస్తున్నాడు:

''రాబోయే అయిదు వందల సంవత్సరాల కాలంలో ఒక కొత్త మతం రూపొందగలదనడం అత్యాశ కాదు. అది మానవాళి ప్రగతికి అనుసంధాయకమైనటువంటిది. దాని అతి ముఖ్య లక్షణం, దానిలోని సార్వజనీనత, ఈ యుగంలోనే ఆరంభమయిన మానవ ఏకీకరణోద్యమమే దాని ఆశయం. ప్రాక్పశ్చిమాలకు చెందిన గొప్ప మతాల్లోని మానవీయ ప్రబోధాలన్నింటినీ అది హృదయానికి హత్తుకుంటుంది. అది మానవ జాతి హేతు బద్ధ అంతర్దృష్టితో విభేదించదు. దాని దృష్టి జీవితంలో ఆచరణపైన, శుష్క ప్రసంగాల పట్ల కాదు. అటువంటి మతం సహజంగానే జీవిత గౌరవానికీ, మానవ సంఘీ భావానికీ సహకరించే కొత్త క్రతువుల్నీ, కళారూపాల్నీ సృజిస్తుంది. సహజంగానే మతమనేది కనిపెట్టబడటానికి ఒక వస్తువు కాదు. కాలం పరిపక్వమయినప్పుడు పూర్వయుగాల్లో సంభవించినట్టే అది ఒక మహాబోధకుడు కొత్తగా ప్రత్యక్షం అయినప్పుడు ఆవిర్భవిస్తుంది. ఈలోగా దేవుణ్ణి విశ్వసించే వాళ్ళు ఆ విశ్వాసానికి అనుగుణంగా జీవించనివ్వండి. దేవుణ్ణి విశ్వసించని వాళ్ళు ప్రేమ, న్యాయాల నిబంధనలకు అనుగుణంగా జీవించనివ్వండి. వేచివుండనివ్వండి (పే. 352)

ఈ వాక్యాలు ఫ్రామ్‌ని ఎంతో ప్రభావితుణ్ణి చేసిన హీబ్రూ ప్రవక్త ఇషయ్యా వాక్యాల్ని గుర్తుకు తెస్తాయి. ఇషయ్యా ఇటువంటి ఆగామి బోధకుడినే దర్శించి ఇలా ప్రకటిస్తాడు:

''... మీ బోధకుడు మీ నుండి ఇంకెంతో కాలం తనను మరుగు పర్చుకోలేడు. మీ నేత్రాలు అతన్ని తప్పక దర్శిస్తాయి. మీరు కుడివైపు తిరిగినప్పుడో లేదంటే ఎడమవైపు తిరిగినప్పుడో 'ఇదీ దారి, ఇటు నడవండి' అని ఒక వాక్యం మీ వెనుకనే మీ చెవుల్లో వినబడుతుంది. అప్పుడు మీరు మీ మసక బారిన విగ్రహాల్ని విసరి కొడతారు. అప్పుడాయన మీరు చల్లిన విత్తనాలకు వాన కురిపిస్తాడు. వాటి నుండి

ధాన్యం విస్తారంగా ఫలిస్తుంది. మీ పశువులు విశాలమయిన పచ్చిక బయళ్ళకు మేతకు చేరతాయి. ప్రతి కొండవాలులోంచి కాలవలు నీళ్ళతో ఉరుకులిడతాయి. ఆయన మీ అవమానాలకు చికిత్స చేసినప్పుడు చంద్రుడు సూర్యకాంతి వంటి ప్రకాశంతోనూ సూర్యుడు ఏడురెట్లు అధికమయిన కాంతితోను ప్రకాశిస్తారు.''

ఫ్రామ్ ఒట్టి సామాజిక శాస్త్రవేత్త కాదు. లేదంటే కేవలం ఆదర్శ వాది కాదు. ఆయన ఒక ద్రష్ట. హీబ్రూ ప్రవక్తల ఇరవయ్యవ శతాబ్దపు సెక్యులర్ వెర్షన్. ఒక నవ్య విజనరీ.

ఫ్రాయిడ్ వల్లా, మార్క్స్ వల్లా ప్రభావితుడయినప్పటికీ వారికన్నా భిన్నంగా తన దర్శనాన్ని ప్రకటిస్తున్నప్పుడు ఫ్రామ్ మూడు అంశాల్లో విశిష్టుడిగా కన్పడతాడు. మొదటిది మానవుడి స్వస్తత అతని భౌతికావసరాలు తీరడంలో కన్నా మానసికావసరాలు తీరడంలో వుందని చెప్పడంలో. ఇది ఫ్రాయిడ్ చెప్పిందే కావచ్చు. కాని ఫ్రాయిడ్ దీన్ని ఒక న్యూరోటిక్ మానవుడికి వ్యక్తిగత స్థాయిలో సూచించిన దాన్ని ఫ్రామ్ మొత్తం సమాజానికంతటికీ వర్తింప చెయ్యడానికి ప్రయత్నించాడు.

సామాజికమయిన ఇటువంటి అస్వస్థత నుంచి బయట పడటానికి ఆయన ఉత్పాదక ప్రేమని పరిష్కారంగా చూపించడం కూడా మనం గమనించాలి.

రెండవది మార్క్స్ వస్తూత్పత్తిలోని పరాయికరణ గురించి మాట్లాడితే ఫ్రామ్ వస్తు వినియోగంలోని పరాయికరణ గురించి మాట్లాడేడు. వినియోగాన్ని ఒక భౌతిక విషయంగా కాక ఒక మానసిక విషయంగా చూడటం ఫ్రామ్ ఆవిష్కరణ. అస్వస్థ మానసిక పరిస్థితి అస్వస్థ వినియోగానికీ, తద్వారా అస్వస్థ ఉత్పత్తికీ దారితీయడాన్ని ఆయన వివరిస్తున్నప్పుడు భోగలాలసత్వంలో కూరుకు పోయిన సమకాలీన జెరుసలేం పైన ఆగ్రహం ప్రకటించిన జెర్మియా, ఇషయ్యా వంటి హీబ్రూ ప్రవక్తలంతా గుర్తొస్తారు. వస్తువుల పట్ల ఏర్పడే ఫెటిషిజం గురించి మార్క్స్ ముందే చెప్పివుండవచ్చు. కానీ ఈ అస్వస్థత వస్తువులను కలిగి వుండటం కన్నా వాడి పారెయ్యడంలో వుందని ఫ్రామ్ చెప్తున్నప్పుడు ఇరవయ్యవ శతాబ్దపు మానవుడిని మరింత స్పష్టంగా మనం అర్థం చేసుకోగలుగుతాం.

మూడవది- విగ్రహారాధన పైన ఆధారపడిన మతం కన్నా మనుషుల్ని మనుషులుగా చూడటంలోని మానవీయ మతం గురించి ఆయన చేసిన అన్వేషణ. ఈ 'విగ్రహారాధన' అన్న మాటలో అన్నీ వస్తాయి. దేవుడు, సిద్ధాంతాలు, యంత్రసామగ్రి, రాజ్యం, నియంత - ప్రతి ఒక్కరూ. విగ్రహారాధన గురించిన ఈ మెలకువ ఆయన హీబ్రూ ప్రవక్తల నుంచి ముఖ్యంగా ఇషయ్యా నుంచి తెచ్చుకున్నాడు. ''...వడ్రంగి ఒక ఓకు చెట్టుని అడవిలో ఎంచుకుని అతి బలంగా పెరిగే దాకా వేచి వుంటాడు. అతడొక దేవదారు వృక్షాన్ని నాటతాడు. వర్షం దాన్ని పోషిస్తుంది. అప్పుడది మనిషికి వంట చెరుకవుతుంది. దాన్లో కొంత చీల్చి మంట చేసి దాని మీద అతడు తన రొట్టెని కాల్చుకుంటాడు. సగం దాకా ఆ మంట మీద రొట్టె కాల్చుకుని తక్కిన సగంతో చలికాచుకుంటాడు. ఇక మిగిలిన దాంతో అతడు దేవుణ్ని చేసి, ఒక విగ్రహాన్ని చేసి దాని ముందు మోకరిల్లుతాడు, ప్రార్థిస్తాడు. 'నన్ను రక్షించు, నువ్వేనా దేవుడవి'' అంటాడు. ''వాళ్ళకి అర్థంకాదు, వాళ్ళు గ్రహించలేరు. ఏమంటే అతడు తన కళ్ళు మూసుకున్నాడు.

మనసుని మరుగు పర్చుకున్నాడు. ఎవరూ గ్రహించరు. ఆలోచించరు. ''సగం కట్టెని నేను మంట పెట్టాను, రొట్టె కాల్చుకున్నాను, తిన్నాను, ఇక మిగిలిందాంతో ఒక అవమానాన్ని తయారు చేసుకోనా? ఒక కట్టె ముక్క ముందు సాగిలపడటమా?'' అని ఇషయ్యా ఈ వాక్యాల్ని మత పరంగా చెప్పి వుండవచ్చు.'' కాని ఫ్రామ్ దీనిలో రాజకీయ అర్థాన్ని కూడా ఆవిష్కరించాడు. రాజ్యం కూడా సాంఘిక శక్తి ముందు ఒక అల్ప భాగమేనని, దాని ముందు మానవుడు సాగిలపడటం పరాయి కరణ పరాకాష్ట అనీ ఫ్రామ్ చెప్పడం మనని చకితుల్ని చేస్తుంది.

స్వస్థ సమాజానికి రహదారులుగా ఫ్రామ్ చూపించిన పరిష్కారాల్లో ఆదర్శవాదమూ, సంస్కరణ వాదమూ వున్నాయి. వాటిని విలువయిన పరిష్కారాలుగా ఎంచలేను. కాని ఫ్రామ్ 'స్వస్థ సమాజం' ప్లేటో 'రిపబ్లిక్'లా, థామస్ మోర్ 'యుటోపియా' లా ఒక పరిష్కారం కోసం చదవ వలసిన గ్రంథం కాదు. అది ఒక దర్శనం. ఆ దర్శనానికి కన్ఫ్యూషియస్ దర్శనంలో వలె ఆరోగ్యవంతమయిన కట్టుబాట్లు ప్రాతిపదిక. బుద్ధుని దర్శనంలో వలె శారీరిక - మానసిక సమ్యక్ యోగమది. భగవద్గీతలో వలె క్రమశిక్షణ కలిగిన ఆధ్యాత్మిక సాధనని అది మనపైన విధిస్తుంది. అయినప్పటికీ ఇరవయ్యవ శతాబ్దపు సెక్యులర్ పరిభాషలో మాట్లాడుతుంది.

స్పినోజా, ఇషయ్యాలకు ఫ్రామ్ ఎంతో ఋణపడివుంటాడు. కాని కబీర్, నానక్, చైతన్యుల గురించి తెలిసి వుండి వుంటే ఫ్రామ్ చింతన మరింత సమగ్రంగా వుండి వుండేది. ముఖ్యంగా విగ్రహారాధన గురించి. సగుణ- నిర్గుణ మార్గాల్లో మనిషిని తోటి మానవుడితో అనుసంధానించడంలో మధ్య యుగాల భారతీయ భక్తి కవుల ప్రయోగాలు ఎంతో విశిష్టమైనవి. రామానుజుడు నుండి రామానందుడు, కబీర్‌ల మీదుగా చైతన్యుడి ద్వారా రామకృష్ణ పరమహంసలో పరిపూర్ణత పొందిన ఈ ప్రయోగాల సారాంశం మానవుడి విముక్తి ఒక సోపాన క్రమంలో సాధ్య మవుతుందన్నది. ఈ కంటిన్యువమ్‌లో దిగువ శ్రేణిలో సగుణ మార్గం, ఎగువ శ్రేణిలో నిర్గుణ మార్గం. విగ్రహాలు - అవి ప్రతీకలు, సిద్ధాంతాలు, యంత్రాలు, వాదాలు, రాజ్య చిహ్నాలు - ఏవయినా కావచ్చు ఒక స్థాయి దాకా సామాజిక అవసరాలే. ఏ సరిహద్దు రేఖపైన విగ్రహారాధన విగ్రహాలకు అతీతమయిన సత్యసాక్షాత్కారంగా మారుతుందో ఆ సున్నిత పార్శ్వాల్ని కబీర్, తులసీ దాస్ ఎంతో మెలకువతో చెప్పారు. ప్రేమ యొక్క ఉత్పాదక పార్శ్వం గురించి మాట్లాడుతున్నప్పుడు ఫ్రామ్‌లో - స్పినోజాలో లేని - ఎంతో కొంత కృత్రిమత్వం, ఆదర్శవాదం కన్పిస్తాయి. ఇటువంటి కృత్రిమత్వం లేని క్రియాశీలతని చూడాలంటే వివేకానందుడు, మహాత్మాగాంధీ , రామమనోహర్ లోహియాల వైపు చూడవలసి వుంటుంది.

ఏమయినప్పటికీ ఫ్రామ్ గతానికీ వర్తమానానికీ, తూర్పుకీ, పశ్చిమానికీ, హేతువుకూ, విశ్వాసానికీ ఒక సేతువు. ప్రయోజన వంతమయిన జీవితాన్ని కోరుకున్న పందొమ్మిదో శతాబ్దపు ఆర్థిక రాజకీయ దర్శనాల పరిమితిని దాటి ఆరోగ్యవంతమయిన జీవితాన్నీ, సమాజాన్నీ కోరుకున్న దార్శనికుడు. సైన్స్‌లోనూ, మతం లోనూ యాంత్రికతను గుర్తించి, వాటిలో సజీవత్వాన్ని పైకి తీసి చూపిన శాస్త్రవేత్త, నీతివేత్త. ఆర్థిక రాజకీయ కార్యకలాపాల్లో మనిషి పైన వస్తువుల ఆధిపత్యం, తద్వారా మనిషి పైన మనిషి ఆధిపత్యం ఎట్లా రూపొందుతున్నాయో గుర్తించి ఆధిపత్యం, అల్పత్వం లేని సమసమాజాన్ని దర్శించిన ద్రష్ట, ప్రసంగి.

# మనిషిని మనిషిగా స్వీకరించే సోషలిజం : ఎరిక్ ఫ్రామ్

– కె. బాలగోపాల్

'సామాజిక అస్తిత్వం సామాజిక చైతన్యానికి పునాది' అన్నది మార్క్సిజంలోని ప్రధాన సూత్రాలలో ఒకటి. మార్క్స్‌కు ముందు ఈ విషయాన్ని ఎవరూ గుర్తించలేదనడం అవాస్తవ మవుతుంది. ఆ విధంగా మార్క్స్ కూడా ఎప్పుడూ అనలేదు. నిజానికి ఈ సూత్రంలోని 'పునాది' అనే మాటను అది సూచించే సంబంధాన్ని ఏవిధంగా అర్థం చేసుకుంటామనే విషయంలో తేడాలుంటాయి గానీ, సామాజిక జీవితాన్ని గురించి మనుషులు చేసే ఆలోచనలను శాస్త్రీయంగా విశ్లేషించే వారెవరైనా సామాజిక అస్తిత్వం మీద మొదట దృష్టి పెట్టక తప్పదు.

అయినప్పటికీ సంప్రదాయక (భావవాద) సామాజిక తత్వ శాస్త్రం మీద ఈ (భౌతిక వాద) సూత్రాన్ని ఆయుధంగా సంధించి ఒక సమగ్రమైన చారిత్రక సిద్ధాంతాన్ని ఆ ప్రాతిపదిక మీద నిర్మించిన ఘనత మార్క్స్‌కే దక్కుతుంది. ఆలోచనలకు జీవితం పునాది అనే ఈ భౌతిక వాద సూత్రం (అందులో ఎన్ని తాత్విక సమస్యలున్నప్పటికీ) ఈ రోజు ఎంతగా మన 'కామన్ సెన్స్'లో భాగమయి పోయిందంటే 'అదేం పెద్ద గొప్ప సిద్ధాంతమా?' అని ఎవరైనా ఆశ్చర్యంగా అడగొచ్చు. అయితే అది మనుషుల సామాన్య ఆలోచనారీతిలో భాగంకావడం మార్క్సిజం సాధించిన విజయమేనని చెప్పక తప్పదు. సామాన్య మానవ ఆలోచనారీతిలో భాగమయి పోవడమే ఒక ఆలోచన సాధించగల అతిగొప్ప విజయమనుకుంటే మార్క్సిస్టు భౌతిక వాదం ఆ విజయాన్ని సాధించినట్టే.

అంత మాత్రం చేత అందులోని తాత్విక సమస్యలు పరిష్కారమయిపోయినట్టు కాదు. సామాన్య మానవ ఆలోచనా రీతులలో తాత్వికంగా సమస్యాత్మకమైనవి అనేకం ఉంటాయి కాబట్టి ఇక్కడ వైరుధ్యమేం లేదు.

మనుషుల చైతన్యాన్ని వారి భౌతిక అస్తిత్వం నిర్ణయిస్తుందని ఎందుకు భావించాలి? నిర్ణయించే ఆ క్రమం ఏమిటి? ఆ అభిప్రాయానికి రుజువేమిటి? ప్రపంచంలో మనకు కనిపించే విభిన్నమయిన మానవ ఆలోచనా రీతులను అర్థం చేసుకోవడానికది సరిపోతుందా? పూర్తిగా వ్యక్తిగతమైన ఆలోచనా రీతులను ఒక పక్కన పెట్టినా! సామాజిక ఆలోచనా స్రవంతులను అర్థం చేసుకోవడానికి సరిపోతుందా? నాజీ వాదాన్నీ, గాంధీ వాదాన్నీ, మత అసహనాన్నీ, సూఫీ వాదాన్నీ, మదర్ థెరెసాను, అణుయుద్ధ దాహాన్నీ, అన్నిటినీ అర్థం చేసుకోవడానికి సరిపోతుందా?

ఈ ప్రశ్నలు వేసుకోవడానికి సాహసించిన మార్క్సిస్టులలో ఎరిక్‌ఫ్రామ్ ఒకరు. బహుశా ఒక్కరేనని కూడా అనవచ్చునేమో. తనకూ తన తరం యూరోపియన్లకూ బాగా పరిచయం ఉన్న నాజీ వాదాన్నీ, యుద్ధోన్మాదాన్నీ, పెట్టుబడిదారీ సరుకుల దాహాన్నీ ఉదాహరణలుగా తీసుకొని అతను ఈ ప్రశ్నలకు జవాబు చెప్పే ప్రయత్నం చేసాడు. విజయం సాధించాడని అనలేముగానీ చాలా విలువయిన విశ్లేషణ చేసాడు.

ఎరిక్‌ఫ్రామ్ గొప్ప ఆశావాది. అతనిది తెచ్చిపెట్టుకున్న ఆశావాదం కాదు, స్వచ్ఛమైన ఆశావాదం. అది అవాస్తవికమయినా దానిని గౌరవించవచ్చును. మార్క్స్ ఆలోచనల తాత్విక మూలాలలోనే మానవ అస్తిత్వాన్ని గురించి, నైజాన్ని గురించి బలమైన ఆశావాదం ఉంది. అయితే

కె. బాలగోపాల్, హైదరాబాదు, పౌరహక్కుల ఉద్యమ నాయకుడు, ప్రముఖ న్యాయవాది.

మార్క్సిస్టులందరూ స్వచ్ఛమైన ఆశావాదులు కాదు. 'బడితె చేతిలో ఉంటే ఈ ప్రపంచం బాగుపడక చస్తుందా' అనుకునే వాళ్లు చాలా మంది ఉన్నారు. మార్క్సిస్టులు అధికారానికి దగ్గరయ్యే కొద్దీ వీరి సంఖ్యే మెజారిటీ అవుతూ ఉంటుంది. దీనికి కారణం కూడా మార్క్స్ సిద్ధాంతంలోనే ఉంది గానీ ఆ విశ్లేషణలోకి పోవడానికిది సందర్భం కాదు.

మనుషుల చైతన్యం మెదడుకు సంబంధించినది (ఆలోచనలు తలలో ఉంటాయి) అనుకున్నంత కాలం, చైతన్యాన్ని అస్తిత్వం నిర్ణయిస్తుందన్న సూత్రాన్ని 'రుజువు' చేయడం సులభమే. అయితే దాని వల్ల మనకు అర్థం అయ్యేదీ స్వల్పమే. ఒక చెట్టు ఏ విధంగా ఉంటుందో ఆ చెట్టుకు సంబంధించి మన ఆలోచనలలో ఉండే చిత్రం కూడ అదే విధంగా ఉంటుంది కదా. కాబట్టి మన జీవిత నైజం ఎట్టిదో దానిని గురించి మనకుండే చైతన్యమూ అట్టిదే.

దీనిని 'ప్రతిఫలన సిద్ధాంతం' అంటారు. దీనిని మనుషులకు చెట్ల స్వరూపాన్ని గురించి ఉండే జ్ఞానానికే కాక, సామాజిక చైతన్యానికి కూడ అన్వయించడంలో ఉండే ఇబ్బందిని భౌతిక వాదులు తొలినాడే గమనించారు. మనుషులలో చాలా మందికి తమ జీవిత ప్రయోజనాలకు వ్యతిరేకమైన ఆలోచనలుంటాయి. కాబట్టి చైతన్యం అస్తిత్వాన్ని ఉన్నదున్నట్టు ప్రతిబింబిస్తుందని నమ్మకూడదని భౌతికవాద తత్త్వవేత్తలు అనసాగారు. సామాజిక అస్తిత్వమే తన అసలు నైజాన్ని కప్పిపెట్టి తలకిందులుగా కనిపిస్తుందని (ఇది ప్రత్యేకించి పెట్టుబడిదారీ 'సరుకుల మాయ'కు ఉండే లక్షణమని), పాలక వర్గాలకు ఆలోచనల సాధికారతపైన ఉండే ఆధిపత్యం వల్ల వారి ప్రయోజనాలే పాలిత వర్గాల ప్రయోజనాలుగా వారు ప్రచారం చేయగలుగుతారని, ఇత్యాది కారణాలవల్ల సామాజిక చైతన్యం సామాజిక అస్తిత్వాన్ని ఉన్నదున్నట్టు ప్రతిబింబించదని అనసాగారు.

ఈ సవరణతో స్వీకరించినా చరిత్రలో కనిపించే అన్ని రకాల చైతన్య రీతులనూ - పైన చెప్పినట్టు నాజీ వాదం నుండి మదర్ థెరిసా దాకా - ఈ సిద్ధాంతం వివరించగలదని నమ్మటం కష్టం. కానీ ఇంతకంటే మెరుగయిన వివరణ ప్రతఫలన సిద్ధాంతంలో లేదు. దానిని సవరించే హెచ్చరికలలోనూ లేదు.

కానీ మనస్తత్వ శాస్త్రం - ముఖ్యంగా సైకో ఎనాలిసిస్ - అభివృద్ధి చెందిన క్రమంలో చైతన్యం మెదడుకు సంబంధించిన విషయం కాదనీ, వ్యక్తిత్వానికి సంబంధించిన విషయమని అర్థమయింది. అప్పుడు చైతన్యాన్ని వివరించడానికి చెట్టు సామ్యం ఎందుకూ కొరగాదు. ఇంకా సరిగ్గా చెప్పాలంటే చైతన్యానికి సంబంధించిన భౌతిక ప్రక్రియ 'ఆలోచించడం' అనే క్రియ - మెదడులోనే జరిగినప్పటికీ చైతన్యానికి సంబంధించిన వస్తువు లేక విషయం మెదడుకు కాక వ్యక్తిత్వానికి చెందినది. చెట్టునో, కుర్చీనో మనం చూడడం అనేది మన వ్యక్తిత్వంతో నిమిత్తం లేని భౌతిక క్రియ కాబట్టి చెట్టు లేక కుర్చీ అనే ఊహ లేక భావన భౌతిక వాస్తవికతకు ప్రతిఫలనం అనడం ఒకెత్తు. సామాజిక చైతన్యాన్ని వివరించడానికి ఇది కనీసం ఒక పోలికగా కూడ పనికి రాదు.

మరి మనిషి వ్యక్తిత్వం ఏవిధంగా రూపం తీసుకుంటుంది? దానిని భౌతిక జీవితమే నిర్ణయిస్తుందని రుజువు చేయగలమా? చేయగలిగినట్టయితేనే మానవ చైతన్యాన్ని మానవ భౌతిక అస్తిత్వం నిర్ణయిస్తుందని చెప్పగలం. ఈ ప్రయత్నం చేయనంత కాలం మార్క్సిజం - ప్రత్యేకించి, చారిత్రక భౌతిక వాదం - అసంపూర్ణంగానే ఉంటుంది.

ఆ ప్రయత్నమే సైకో ఎనాలిసిస్ ప్రాతిపదికగా ఎరిక్ ఫ్రామ్ చేసాడు. కానీ ఫ్రాయిడ్‌ను మౌలికంగానే సవరించి వేసాడు. మానవ లైంగికత ( ఫ్రాయిడ్ ఈ మాటను మామూలుగా వాడే అర్థం కంటె విశాలమైన అర్థంలో వాడతాడు) బాల్యంలో వ్యక్తమయ్యే రూపాలకూ కుటుంబ పెద్దల ద్వారా అమలయ్యే సామాజిక నియమాలకూ మధ్యనుండే వైరుధ్యాన్నీ దాని పర్యవసానాలను ప్రాతిపదిక చేసుకొని ఫ్రాయిడ్ మనిషి వ్యక్తిత్వం రూపొందే క్రమాన్ని వివరిస్తాడు.

ఎరిక్ ఫ్రామ్ ఫ్రాయిడ్ విశ్లేషణలను అనేక సందర్భాలలో వాడుకుంటాడు గానీ, వ్యక్తిత్వ విశ్లేషణకు వేరే ప్రాతిపదిక ప్రతిపాదిస్తాడు. మానవ నైజాన్ని నిర్వచించి దానిని పునాది చేసుకొని తన విశ్లేషణను రూపొందిస్తాడు. మానవ నైజాన్ని నిర్వచించడ మంటే మనుషులు ప్రాథమికంగా మంచి వారని గానీ, ప్రాథమికంగా చెడ్డవారని గానీ ప్రకటించడం కాదు. మానవ అస్తిత్వ నైజాన్ని ( ఆంటాలజీ - **ontology**) వివరించడం.

మార్క్స్‌కు ముందు తత్వవేత్తలందరూ మానవ నైజాన్ని సూత్రీకరించారని, మార్క్స్ ఆ పని చేయలేదని ప్రతీతి. మార్క్సిస్టులలో ఇతరత్రా విభేదాలున్నా వారుకూడ ( గ్రాంసి, లెనిన్, అల్తూజర్‌లను ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు) ఈ మాటే అంటారు. అనడమే కాక దానిని మార్క్స్ విశిష్టతగా భావిస్తారుకూడ. మార్క్స్ అటువంటి సూత్రీకరణ చేయక పోవడానికి ఒక కారణం ఉంది. ఆయన దృష్టిలో ఇప్పటివరకు మనిషి నిండయిన మనిషే కాదు. మనిషి తన సృజన శక్తిని అపరిమితంగా అభివృద్ధి చేసుకోవడానికి అవసరమైన భౌతిక ఉత్పాదన శక్తిని సాధించుకున్న తరువాతే అసలయిన మనిషి ఉద్భవించడం జరుగుతుంది. మనిషి 'ఒకరితో అందరూ అందరిలో ఒకరుగా' తన సృజన శక్తిని వెయ్యి రీతుల ఆవిష్కరించుకునే దశ అప్పుడు మొదలవుతుంది. అదే అసలయిన మానవ చరిత్ర. ఆ లోపల ఉన్న మనిషి ఇంకా అవసరాలకూ, అపరిపక్వమైన ఉత్పాదనా శక్తికీ బానిస. ఈ మనిషినే నిర్వచించి, 'మనిషి ఇది, అది' అంటూ సూత్రీకరించడంలో అర్థం లేదు. చేయవలసింది ఈ మనిషి నిజమైన 'మనిషితనాన్ని' సాధించడనాకి అవసరమైన ఉత్పాదనా శక్తిని పొందే స్థితికి ఎదిగే చారిత్రిక క్రమంలోని వైరుధ్యాలను విశ్లేషించడం, వాటిని ముందుకు నడిపించడం. తరువాత రాగల దశకూ ప్రస్తుతం మనం బతుకుతున్న 'చరిత్ర పూర్వ' దశకూ మధ్య ఒక అగాధం ఉంది. దానికి ఆవలా ఈవలా ఏ విషయమూ ఒకటి కాదు. అందువల్ల ఈవల నిలబడి ఆవల ఆవిర్భవించబోయే మనిషిని నిర్వచించడం నిరర్థకం.

నిర్వచనం అక్కర లేదని భావించే ఈ ధోరణిలోనూ ఒక నిర్వచనం ఉంది. అసలయిన చరిత్ర మొదలయినాక మనిషి ఎప్పటికప్పుడు తనను వినూత్నంగా నిర్వచించు కోవడం జరుగుతుంది. నిరంతర పునర్నిర్వచనమే అసలైన మనిషి నైజం. అప్పటివరకు జరిగే చరిత్ర పూర్వ దశ అంతా ఆ స్థితికి బీజమైన అనంత ఉత్పాదనా శక్తిని అందుకునే క్రమమే తప్ప వేరే ఏమీ కాదు కాబట్టి, చరిత్ర పూర్వదశలో మనిషి ప్రధాన లక్షణం ఉత్పాదనా క్రియ, లేక సృజనాత్మక శ్రమ. అదే ప్రస్తుతానికి మనిషినైజం. ఆ తరువాత ఒక స్థిరమైన నైజమంటూ లేకపోవడమే మనిషినైజం.

ఇది ఎందుకయినా పనికొస్తుందేమో గానీ మనం మొదట్లో వేసుకున్న ప్రశ్నకు - సామాజిక అస్తిత్వం సామాజికచైతన్యాన్ని నిర్ణయించే క్రమం ఎటువంటిది? అనే ప్రశ్నకు - జవాబు చెప్పడానికి మాత్రం పనికి రాదు.

ఎరిక్ ఫ్రామ్ మానవ నైజాన్ని నిర్వచించడం అవసరమని నమ్మిన ఒకే ఒక మార్క్సిస్టు. అయితే దాని అర్థం స్వభావ రీత్యా మనుషులు ప్రాథమికంగా స్వార్థపరులనో, నిస్వార్థపరులనో, మంచి వాళ్లనో,

చెడ్డ వాళ్లనో ప్రకటించడం కాదు. మానవ అస్తిత్వ నైజాన్ని నిర్వచించడం. ఇతర జంతువుల ప్రవర్తన ప్రధానంగా వాటి జన్యువులలోనే నిర్ణయించబడి ఉంటుంది. మనిషిలో జన్యువులు నిర్ణయించేది కొంచెమే. మనిషి అనివార్యంగా తనచుట్టూ ఉన్న పరిసరాలతో - ఇతర మనుషులతో ప్రయత్న పూర్వకంగా, సంకల్ప పూర్వకంగా వ్యవహరించాలి. ఇది మానవ అస్తిత్వ నైజంలోనే ప్రాథమిక అంశం.

రెండవది ఏమిటంటే తన పరిసరాలతోనూ ఇతర మనుషులతోనూ మనిషి ఏర్పరచుకునే సంబంధాలు స్థూలంగా రెండు రకాలు. మొదటి రకానికి ప్రేమ అనేది సంకేతం. స్నేహం, సహకారం, సానుభూతి, పరస్పరత మొదలయిన గుణాలు ఈ కోవకు చెందినవి. వీటికి ఒక సూచికగా ఫ్రామ్ 'ప్రేమ' అనే మాటను ప్రయోగిస్తాడు. రెండవ రకానికి చెందినగుణాలకు ఫ్రామ్ పరిభాషలో 'విధ్వంసం' అనే మాట ఒక సూచిక, లేక సంకేతం. ద్వేషం, ఈర్ష్య, ఆధిపత్యం మొదలయినవి ఈ కోవకు చెందిన గుణాలు.

ఈ రెండు రకాలుగా మనుషులు తమ పరిసరాలతో సంబంధాలు నెలకొల్పుకుంటారు. ఇవి రెండూ మానవ సహజమైనవే, ఈ అర్థంలో 'మానవీయమైనవే.' మనం అమానుషం, అమానవీయం అనేవి కూడ పూర్తిగా మానవీయమైన గుణాలే. ఇతర జంతువులు ఆత్మ రక్షణ కోసము, ఆహారం కోసము క్రూరంగా ప్రవర్తిస్తాయి. ఆనందం కోసం క్రూరంగా ప్రవర్తించగల ఏకైక జంతువు మనిషి. ( మన అహంకారం ఎంతటిదంటే దీనిని మనం 'పశుత్వం' అంటాం! )

ఒక్కొక్క సామాజిక వ్యవస్థలో, ఒక్కొక్క సామాజిక వర్గంలో ఎదిగే పిల్లలు, బతికే పెద్దల వ్యక్తిత్వాలలో ఈ రెండు కోవలకు చెందిన ప్రవర్తనా రీతులు, గుణాలు, విలువలు, ఆలోచనలు ఏ విధంగా నెలకొంటాయన్న విషయాన్ని ఎరిక్ ఫ్రామ్ తన రచనలలో సైకో ఎనాలిసిస్‌కు చెందిన విశ్లేషణా పరికరాల సహాయంతో విపులంగా వివరిస్తాడు. తద్వారా సామాజిక అస్తిత్వం వ్యక్తిత్వాలనూ ఆపైన చైతన్యాన్నీ నిర్ణయించే తీరును వివరిస్తాడు. వర్గమే అంతిమ నిర్ణాయక శక్తి అన్న తన రాజకీయ విశ్వాసాన్ని 'రుజువు చేసేయడం' కోసం అనేక సాధారణ జీవిత పరిస్థితులకు వర్గ ప్రత్యేకతను ఆపాదిస్తున్నాడన్న సందేహం తరచూగా వచ్చినప్పటికీ 'ఆర్థిక పునాది' ని మాత్రం విశ్లేషించి మొత్తం వివరించినట్టు ప్రకటించే సగటు మార్క్సిస్టుల సామాజిక విశ్లేషణతో పోలిస్తే ఆయన రచనలు చాలా ఆసక్తికరమైనవి. తన సమకాలీన యూరోపియన్ సమాజంలో విధ్వంసం అనేదే ప్రధానగుణం కావడం ఫాసిజానికి అనుకూలమైన వ్యక్తిత్వాలను తయారు చేసిందని ఫ్రామ్ చాలా ఆసక్తికరంగా వివరిస్తాడు.

విధ్వంసం ప్రేమలాగ ఎప్పుడూ మానవ ప్రవర్తనా రీతులలో ఉండేగుణమేనని ఒప్పుకుంటూకూడ, ప్రేమదే పైచేయి అయ్యే సామాజిక పరిస్థితుల రూపకల్పన కోసం కృషి చేద్దాం రమ్మని తన పాఠకులను ఫ్రామ్ ఆహ్వానిస్తాడు. ఇది కేవలం సామాజిక పరిస్థితులకు సంబంధించిన విషయమేనా అన్న సందేహం ఫ్రామ్ రచనల నుండే వస్తుంది. ఆ విషయం అతనే చూడ లేకపోవడం అతని ఆశావాదం ఫలితం. ఏమయితేనేం ఇది మార్క్సిజాన్ని మానవ భూమిక మీద నిలబెట్టే ప్రయత్నమని చెప్పవచ్చు. తన రాజకీయ సిద్ధాంతం 'హ్యూమనిస్ట్ సోషలిజం' అని ఎరిక్ ఫ్రామ్ అంటాడు. అంటే మనిషి అస్తిత్వ నైజాన్నీ దాని పర్యవసానాలనూ వాస్తవికంగా స్వీకరించే సోషలిస్టు ఆదర్శమని అర్థం. ఆ పర్యవసానాలను ఫ్రామ్ విశ్లేషించే పద్ధతిలో అతని ఆశావాదం నుండీ వర్గ నిర్ణాయక సిద్ధాంతం అవశేషాలనుండీ పుట్టిన కప్పదాట్లు అనేకం ఉన్నాయని గుర్తించినప్పటికీ, మనిషిని మనిషిగా స్వీకరించే సోషలిస్టు ఆదర్శాన్ని మించిన రాజకీయ లక్ష్యం వేరే ఉండజాలదని ఒప్పుకోవలసిందే.

# ఎరిక్ ఫ్రామ్-కొన్ని భావనలు

- బి. తిరుపతిరావు

సంశయవాదం తత్వశాస్త్ర అభివృద్ధి అత్యవసరం అనేది ఎవ్వరు తిరస్కరించలేని అంశం. అయితే ప్రతితాత్వికుడు ఎక్కడో ఒక దగ్గర దీన్ని వదిలివేస్తాడు. ఈ వదిలివేయటం అనివార్యం కాకపోవచ్చు కానీ, సాధారణంగా అలాగే జరుగుతూ వుంటుంది. గతాన్ని వదలివేస్తే, కనీసం ఇరవయ్యో శతాబ్దంలో అలాగే జరిగింది. అనేక మౌలిక ప్రతిపాదనలు చేసిన తాత్వికులు తమ తమ ప్రతిపాదనలకి అడ్డుపడి ఆపివేయటమో లేక అవి శాస్త్రీయమని, శాశ్వతమని, అఖండమని భావించటమో జరుగుతూ వచ్చింది. అయితే ఇందుకు భిన్నంగా కూడా మనకి కొంతమంది తాత్వికులు కన్పిస్తారు. వీళ్ళు తమని తాము నిరంతరం సంశయించుకుంటూ, పరీక్షించుకుంటూ, తాత్విక చర్చలు, విశ్లేషణలు చేశారు. సరిగ్గా ఇటువంటి కోవకు చెందినవాడు ఎరిక్ ఫ్రామ్.

పద్దెనిమిది వందల పద్దెనిమిదిలో ముగిసిన మొదటి ప్రపంచ యుద్ధం నాటికి పద్దెనిమిదేళ్ళ వయస్సులో వున్న ఎరిక్ ఫ్రామ్‌కి తన వర్తమానం బీభత్సకరంగా కనిపించింది. యుద్ధం ఎలా సాధ్యమయిందనే విషయం మీదనే మౌలిక ప్రశ్నలు అతనిలో ఆ వయస్సులోనే తలెత్తాయి. ఈ క్రమంలో అతనిలో అన్ని అధికార భావజాలాల పట్ల, ప్రకటనల పట్ల అనుమానాలు రేకెత్తాయి. 'of all one must doubt' అనేది ఒక నినాదంగా కాక తన మూర్తిమత్వంలో భాగమయింది. దీని ఫలితంగానే తనకి చరిత్రని సెక్యులర్ దృక్కోణం నుంచి చూసే శక్తి వచ్చిందని తానే చెప్పుకున్న మార్క్సిజాన్ని కూడ సంశయించేటట్టు, కనీసం మార్క్సిస్టుల్ని సంశయించేందుకు కారణమయింది.

ఏ తాత్వికుడయిన అప్పటికే ఏర్పడి వున్న బౌద్ధిక వాతావరణం లేక మేధో వాతావరణం చేత ప్రభావితం చేయబడటం జరుగుతుంది. 1920ల నాటికి సామాజిక శాస్త్రాలలో చర్చకు గురవుతూ వున్న అంశాలు ఫ్రామ్‌ని కొంత తీవ్రంగానే ప్రభావితం చేశాయి. పంతొమ్మిదవ శతాబ్దపు అగస్ట్ కామ్ట్ (Aguste Comte) భావాలు ఫ్రాన్స్‌లోను, హెర్బర్ట్ స్పెన్సర్ ఆలోచనలు ఇంగ్లండ్‌లోనూ, మార్క్స్ తాత్విక ప్రతిపాదనలు జర్మనీలో తీవ్రంగా ప్రచారమవుతూ వున్నాయి. వీళ్ళ ముగ్గురి ఆలోచనలు ప్రపంచాన్ని చుట్టు ముట్టాయి. సామాజిక సంస్థలు, మానవ ప్రవర్తన మొదలైన వాటి గురించిన విశ్లేషణకు కావలసిన భావనలు చాలా తీవ్రంగానే వున్నాయి. రెండవ వైపు మానవ పరిణామాన్ని గురించి డార్విన్ ప్రతిపాదించిన సూత్రాలు సమాజాన్ని కుదిపివేస్తున్నాయి. మానవ శాస్త్రం (anthropology), సామాజికశాస్త్రం, మనోవైజ్ఞానికశాస్త్రాలు అప్పటికే నిర్దిష్ట సిద్ధాంతాలుగా రూపొందాయి. వీటన్నింటి కంటే మార్క్స్ ఆలోచనలు, ముఖ్యంగా చరిత్ర గురించి మార్క్స్ వస్తుగత దృష్టి, చరిత్రని వర్గ పోరాటాల్లోంచి, వర్గ నిర్మాణంలోంచి చూసే వైఖరి, పెట్టుబడిదారీ (ethos) ఆయన విశ్లేషించిన పద్ధతి, సామాజిక క్రమంలో నిర్ణాయక అంశాల గురించిన మార్క్స్ భావాలు మొదలైనవన్నీ అప్పటి సామాజిక శాస్త్రాల మీద తీవ్ర ప్రభావాన్ని చూపుతున్నాయి. సామాజిక శాస్త్రం సమాజాన్ని మనిషి కూడా అవగతం చేసుకోవటానికి మంచి సాధనమనే భావం బలపడింది. అలాగే ఫ్రాయిడ్ ప్రతిపాదనలు రూపంలో మనోవైజ్ఞానిక శాస్త్రానికి మాత్రమే సంబంధించినట్టు కన్పించినా సారాంశంలో అవి కూడా సామాజికశాస్త్రంలో భాగంగానే అవగతం చేసుకోబడ్డాయి.[1] ఈ నేపథ్యంలో ఫ్రామ్‌ని ఆకర్షించిన వాళ్ళు మార్క్స్, ఫ్రాయిడ్. 1926-30ల మధ్య ఫ్రామ్ తాత్వికంగా తానేమిటో తెలుసుకునే

---

బి. తిరుపతిరావు, సిద్ధార్థ ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, విజయవాడలో ఉపన్యాసకులుగా పని చేస్తున్నారు.

ప్రయత్నంలో వున్నాడు. ఒక నిర్దిష్ట మేధావిగా తన గుర్తింపు కల్పించుకునే అన్వేషణలో వున్న ఫ్రామ్‌కి మార్క్స్, ఫ్రాయిడ్‌ల పట్ల ఆకర్షణ ఏర్పడింది. ఈ స్థితిలో అప్పటికే ఏర్పడి వున్న ఫ్రాంక్‌ఫర్ట్ స్కూల్ అని పిలవబడే ప్రముఖ మార్క్సిస్టు అధ్యయన సంస్థ, హెన్రిక్ ద మాన్ అనే ఆయన ప్రచురించిన The Psychology of Marxism, (1928) అనే గ్రంథం ఫ్రామ్‌ని తీవ్రంగా ప్రభావితం చేశాయి. "The Psychology of Marxism' గ్రంథ రచయిత మార్క్స్ ఆర్థిక నియతివాదాన్ని అధిగమించే ప్రయత్నం చేశాడు అంటారు. అన్ని సాంఘిక, రాజకీయ చర్యల వెనుక వుండే వ్యక్తిగత ప్రేరణలను (Subjective motivation) గురించి, వాటి ఆధిక్యతల గురించి ప్రస్తావించాడు. అలాగే మార్క్స్‌లో కనిపించే మితిమీరిన వస్తుగతత్వాన్ని బహిర్గతం చేయటం కూడా ద మాన్ చేశాడు. ఈ రచన ఫ్రామ్‌ని బాగా కదిలించింది. మార్క్స్‌ని, ఫ్రాయిడ్‌ని సైద్ధాంతికంగా సమ్మిళితం చేయాలనే తన ఆలోచనకి ఊతం దొరికినట్లయింది.[2] ఈ ఆలోచనకి రూపకల్పన ఇస్తూ ఫ్రామ్ 1932లో 'On the Methods and Goals of Analytical Social Psychology' అనే వ్యాసం రాశాడు. ఒక రకంగా ఈ వ్యాసం ఆ తరువాత ఫ్రామ్ రాసిన అనేక రచనలకి ఆధారమయిందంటారు. మార్క్స్ చేసిన సామాజిక, ఆర్థిక స్థితుల విశ్లేషణని, ఫ్రాయిడ్ ప్రస్తావించిన లేక మానవ డ్రైవ్స్ (Humnan drives) సమ్మిళితం చేసి తాను ముందుకు తీసుకు వచ్చిన సామాజిక మనో వైజ్ఞానిక శాస్త్రానికి (Social Psychology) ఫ్రామ్ అంకురార్పణ చేశాడు. ఇది చాలా స్పష్టంగా మార్క్సిజాన్ని ఫ్రాయిడ్ మనో విశ్లేషణా శాస్త్రంతో జతచేసే ప్రయత్నమే.

ఫ్రామ్ చేసిన ప్రయత్నపు అంతిమ లక్ష్యం సహజాత నిర్మాణాన్ని (Instinct structure), స్థూలంగా ఒక సామాజిక బృందపు అచేతనపు ప్రవర్తనా పద్ధతుల్ని సాంఘిక, ఆర్థిక నిర్మాణాల్లోంచి చూసి విశ్లేషించటానికి చేసే ప్రయత్నమే. మనో విశ్లేషణాశాస్త్రం చారిత్రక భౌతికవాద భావనకి ఒక క్రొత్త దృక్కోణాన్ని ఏర్పర్చగలదని ఫ్రామ్ నమ్మాడు. సామాజిక పరిశీలనలో నూతన అంశాల్ని అవగతం చేసుకోవటానికి ఉపయోగపడటమే కాకుండా అసలు మానవ ప్రవృత్తిని అర్థం చేసుకోవటంలో మనో విశ్లేషణ శాస్త్రం గొప్ప సహాయకారి కాగలదని ఫ్రామ్ నమ్మాడు. భౌతికస్థితులు వ్యక్తి చేతన మీద కలిగించే వొత్తిడులను, ప్రభావాలను గతి తార్కిక భౌతికవాదం అర్థం చేసుకోవటంలో విఫలమయిందని ఈ ఖాళీని మనో విశ్లేషణా శాస్త్రం పూరించగలదని కూడా ఆయన అనుకున్నాడు.

భావజాలాలు కొన్ని వాంఛల, వొత్తిడుల (drives), అవసరాల ఉత్పాదనలని, చేతనా పూరిత ప్రపంచంలో వాస్తవికీకరించబడని ఈ అంశాలు బాహ్య ప్రపంచంలోకి భావజాలాలుగా ఆవిష్కరింపబడుతుంటాయని ఫ్రామ్ భావన. అలాగే ఈ సహజాతాలు ఒకరకంగా Biological drives ఫలితాలని, మరొక వైపు ఇవి ఒక వ్యక్తి లేక బృందపు సాంఘిక, ఆర్థిక స్థితి నుండి రూపొందుతాయని కూడా ఫ్రామ్ అనుకున్నాడు. భావాల్ని, భావజాలాల్ని మనో విశ్లేషణా శాస్త్రం ద్వారా విశ్లేషించవచ్చని కూడా ఫ్రామ్ నమ్మాడు. ఫ్రామ్ తన తొలి రోజుల్లోని ఈ నమ్మకాన్ని చాలా రచనల్లో రకరకాల సందర్భాలలో ప్రస్తావిస్తూ వచ్చినా, 'Beyond the Chains of Illusion: My Encounters with Marx & Freud' (1962) అనే రచనలో మార్క్సిజాన్ని, ఫ్రాయిడ్‌వాదాన్ని తులనాత్మకంగా చూడటంతో పాటు రెండింటికి మధ్య వుండాల్సిన సంబంధాన్ని నొక్కి చెప్పాడు. ఈ పుస్తకాన్ని గురించి కొంతలోతుగా చర్చించబోయే ముందు ఈ పుస్తకంలో అంశాల్ని బీజరూపంలో ఎప్పుడో 1941 లో రాసిన 'Escape from Freedom' అనే రచనలో వ్యక్తం చేశాడు. (ఇదే పుస్తకం 'The Fear of Freedom' పేరుతో కూడా అచ్చయింది). ఒక రకంగా ఈ పుస్తకం అధికారవాద

మనస్తత్వ శాస్త్ర సిద్ధాంత విశ్లేషణగా భావించవచ్చు. ఆధునిక మనిషి స్వభావ నిర్మాణం, మనస్తత్వ శాస్త్రం - సామాజిక శాస్త్రంల మధ్య వున్న సంబంధం మొదలైన అనేక కీలకాంశాలను గురించి చర్చ, ఈ పుస్తకంలో కన్పిస్తుంది. ఈ పుస్తకం ఆధునిక మానవుడి స్వభావ నిర్మితిని పరిశీలించటానికి, అలాగే మనో వైజ్ఞానిక శాస్త్రానికి, సామాజిక శాస్త్రానికి మధ్య సంబంధాన్ని చూపటంలో ఎదురయ్యే సమస్యల్ని చర్చించటానికి ఉద్దేసించింది. ఈ విషయాన్ని తాను రాసిన ముందు మాటలో స్వయంగా ఫ్రామ్ చెప్పుకున్నాడు.[3]

ఒక సామాజిక అణిచివేతకు వ్యతిరేకంగా ఉద్యమిస్తున్న బృందం లేక తమ స్వంత విముక్తి కోసం ఉద్యమిస్తున్న వాళ్ళు తమని విముక్తం చేసుకోవటమే కాకుండా మొత్తం సమాజాన్ని విముక్తం చేస్తారని భావించటం జరిగిందని అయితే చరిత్రలో ఒక సందర్భంలో ఒకానొక అణిచివేతకు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజలు విజయం సాధించిన తరువాత స్వేచ్ఛకి శత్రువులుగా మారిపోతూ వున్నారు. ఫలితంగా ఆధిపత్యానికి వ్యతిరేకంగా ఉద్యమించుట అనేది నిరంతరాయక్రమంగా ఫ్రామ్ భావిస్తాడు. ఈ అంశాన్ని ఫ్రామ్ ప్రధానంగా అధికారవాదానికి, ముఖ్యంగా నాజీ యిజానికి, ఫాసిజానికి అనువర్తింప జేసి మాట్లాడుతాడు. అయితే ఇది ఇంతవరకు అమలు జరిగిన లేక వర్ధిల్లిన కమ్యూనిస్టు వ్యవస్థలకు కూడ వర్తిస్తుందని గుర్తించాల్సి వుంటుంది.

నాజీ యిజం, ఫాసిజంలు రూపుదిద్దుకుంటున్న నేపథ్యంలో వాటికి సంబంధించిన హెచ్చరికలు కొన్ని నీచీ, మార్క్స్, ఫ్రాయిడ్‌ల నుంచి వచ్చాయంటాడు ఫ్రామ్. పందొమ్మిదో శతాబ్దపు ఉదాసీనత నిండిన స్వయం సంతృప్తి (Complacency) ని నీచీ చెదరగొట్టే పని చేస్తే, అదే పనిని మార్క్స్ మరొక రకంగా చేసాడు. అయితే ఈ విషయంలో, ముఖ్యంగా మనిషిలోని అతార్కిక, అచేతన అంశాల విశ్లేషణ వైపు దృష్టిసారించే విషయంలో ఫ్రాయిడ్ తనముందువాళ్ళకంటే గొప్ప క్రాంతిదర్శి కాగలిగాడని ప్రకటిస్తాడు.[4] ఆధునిక హేతువాదం విస్మరించిన లేక నిరాకరించిన అచేతనం, మానవ స్వభావం అనే అంశాల్ని హేతుబద్ధంగా కూడా అవగతం చేసుకోవచ్చనే ప్రతిపాదన చేస్తారు. అయితే ఈ మితిమీరే హేతువాదాన్ని ముందుకు తెచ్చిన వాదాలల్లో మార్క్సిజపు పాత్ర గణనీయంగా వుందనే విషయాన్ని ఫ్రామ్ ప్రస్తావించాడు.

మానవ ప్రవృత్తి రూపు దిద్దుకున్న క్రమానికి చరిత్ర రూపొందిన క్రమానికి మధ్య బలమైన సంబంధమే వుంటుంది. సామాజక సమస్యల కారణాల్ని వ్యక్తి మనో ప్రపంచపు పరిభాషలో, లేక వైయక్తిక లేక మనస్సుకు సంబంధించిన అంశాల్ని సామాజిక శాస్త్ర పరిభాషలో మాత్రమే వివరించే ప్రయత్నాలను ఫ్రామ్ నిర్ద్వంధంగా నిరాకరించాడు. ఈ అంశాలలో ఫ్రామ్ ఫ్రాయిడ్, మార్క్స్‌ల కిద్దరికీ దూరంగా వున్నాడు. వ్యక్తి వాంఛలు, కోర్కెలు, ఆందోళనలు సామాజిక క్రమపు ఫలితంగా మారుతూ వుంటాయని, అభివృద్ధి చెందుతూ వుంటాయని అదే విధంగా మనిషి శక్తులు నిర్దిష్ట రూపాలుగా మారే క్రమంలో అవి సామాజిక క్రమాన్ని మార్చుతాయని ఫ్రామ్ భావించాడు. 'మనిషి చరిత్ర చేత రూపొందించబడటమే కాదు, మనిషి కూడా చరిత్రని రూపొందిస్తాడు.[5] అనేది ఫ్రామ్ నినాదం.

పెట్టుబడిదారీ విధానపు అభివృద్ధి క్రమంలో రూపుదిద్దుకున్న మనిషిని విశ్లేషించటంలో ఫ్రామ్ విశేష శక్తిని కనపర్చాడు. ఆధునిక Totalitarianism అనేది కుటుంబం, సమూహం, మతం అనేది మౌలిక బంధాల నుంచి వేరు చేయబడ్డ మనిషి ఒంటరితనానికి వ్యతిరేకంగా ముందుకు వచ్చినట్లు ఫ్రామ్ భావించాడు. ఈ సమాజాల్లో మనిషికి కల్పించిన కృత్రిమ బంధాలు మౌలికాంశాల లేక మౌలిక

బంధాలని ప్రత్యామ్నాయంగా ముందుకు తీసుకు రాబడినప్పటికీ అంతిమంగా అవి మనిషిని మరింత భయకంపితం చేశాయి.

ఎరిక్ ఫ్రామ్ ప్రకారం ప్రతియుగంలోనూ మానవ మూర్తిమత్వంలో మౌలిక మార్పులు చోటు చేసుకుంటూ వచ్చాయి. అసలు మనిషిచరిత్ర ప్రకృతికీ తనకి మధ్య ఎటువంటి వైరుధ్యం లేకుండా, వొకానొక ఏకత్వంతో మొదలైంది. ప్రారంభంలో మనిషి ప్రకృతిమీద ఆధిపత్యస్థితిలో కాక సయోధ్యతలో వున్నాడు. తాను ఒక ప్రత్యేక జీవిననే స్పృహ తనకి లేదు. తనతోటివాళ్ళతోనూ, తన చుట్టూ వున్న భౌతిక ప్రపంచంతోనూ ఐక్యతలో వుంటూ మొత్తం ప్రకృతిలో తానొక విడదీయరాని అంశంగా తనని చూసుకున్నాడు. మనిషికున్న ఈ భావనే తనని పరాయికరణ నుంచి దూరంగా వుంచింది. ఈ స్థితిలో వున్న మనిషికి భౌతిక పరమైన ఇబ్బందులు ఎన్ని వున్నా పరాయికరణ భావం లేదు. సామాజిక క్రమం సంఘర్షణా రహితంగా నడిచి వున్నట్లయితే మనిషికి ఇంకా అటువంటి పరాయికరణ లేని స్థితే మిగిలి వుండేది. సంఘర్షణాత్మకంగా నడిచిన చరిత్ర మనిషిని అంతిమంగా పరాయికరణలోనికి నెట్టింది. మధ్య యుగం నుంచి మానవ స్థితిలో మౌలిక మార్పులు మొదలయి ఇవ్వాళ్టికి అది తీవ్రస్థాయికి చేరిన నేపథ్యంలో పరాయికరణ తీవ్రస్థాయికి చేరింది. అలాగే మధ్యయుగాల నుంచి పెరుగుతూ వచ్చిన వ్యక్తి వాదం (Individualism) ఆధునిక యుగంలో దాని తీవ్ర రూపానికి చేరుకుంది. ఈ వ్యక్తి వాదం పరాయికరణ ఫలితమే. ఈ వ్యక్తివాదం ఒక తరహా నిరంకుశత్వానికి దారితీసింది. ఏదో ఒక స్థాయిలో మనిషి అందుబాటులోకి వచ్చిన స్వేచ్ఛ, స్వయం చేతన (Self-awareness) వల్ల అంతకుముందు తనకున్న భావసంబంధమైన ధైర్యాన్నించి మనిషి దూరమయ్యాడు. ఈ క్రమంలో సామాజిక జీవితం జీవన్మరణ సంఘర్షణా క్షేత్రంగా మారిపోయింది. ఈ పోరాటంలో ఓడిపోయిన వాళ్ళు చులకనగా చూడబడ్డారు. మత ఆధిపత్యం నుంచి మనిషిని బయటపడవేసిన ఆర్థిక అంశం దాని దారిలో అది వృద్ధి కావటం జరిగింది. నైతికత నుంచి మనిషి ఆర్థిక జీవితం విముక్తమయింది. ఏ సంప్రదాయ బంధాలు లేకుండా ప్రతిదీ తన ప్రయత్నం మీదనే ఆధారపడి వుందనే భావనకి మనిషి రావటం జరిగింది. పెట్టుబడిదారీ విధానం రూపుదిద్దుకోవటం మతం కొంత ఉదార స్వభావాన్ని సంతరించుకోవటమూ రెండూ కూడా ఒకేసారి సంభవించాయి.[6]

ఈ నేపథ్యంలో ముందుకు వచ్చిన ఆధునిక నిరంకుశవాదం (Totalitarianism) లేక ఏకాధిపత్యవాదం అనేది కుటుంబం, సమూహం, మతం లాంటి ప్రాథమిక మానవ బంధాల నుంచి వేరు చేయబడిన మనిషి తన ఒంటరితనానికి వ్యతిరేకంగా రూపొందించినదిగా ఫ్రామ్ ప్రకటిస్తాడు. ఏకాధిపత్య వ్యవస్థలో ఈ పై ప్రాథమిక బంధాల స్థానంలో కృత్రిమ బంధాలను ఏర్పర్చటం జరిగిందని ఈ క్రమంలో చాలా చేతనాపూరితంగానే మనిషి వ్యక్తిత్వాన్ని అంతం చేయటం జరిగిందని చెపుతాడు ఫ్రామ్. వ్యక్తి సహజ అహాన్ని (Self) అంతం చేసి దాని స్థానంలో ఒకానొక కృత్రిమ అహాన్ని రూపొందించటం వల్ల అది సమాజంలో వ్యక్తి నిర్వర్తించాల్సిన పాత్రల్ని (Roles) మాత్రమే నిర్దేశించే అంశం మిగిలింది. తన సహజ అహాన్ని కోల్పోయిన వ్యక్తిలో వుండే అభద్రతాభావం నిరంతరం ఆ వ్యక్తిని వెంటాడుతూ వుండటం వల్ల ఇవ్వాళ అమలులో వున్న వ్యవస్థలకి అనుసంధానించబడటం సులువయింది. వ్యక్తి తన గుర్తింపుని కోల్పోయి, కోల్పోయిన ఆ గుర్తింపు నిరంతరం ఇతరుల నుంచి పొందాలనే తపన కూడా తనని అభద్రతలోకి నెట్టివేసింది.[7] ఫలితంగా అమలులో వున్న వ్యవస్థల్లో వ్యక్తి మీద తీవ్రనిర్బంధం చెలాయించటానికి, అసలు వ్యక్తి అస్తిత్వానికి ఎసరు పెట్టటానికి కూడా వెనుకాడలేదు. ఇంతకుముందే చెప్పుకున్నట్లుగా ఏకాధికార వ్యవస్థల గురించి ఫ్రామ్ "Escape from Freedom'

లో వెలిబుచ్చినవి ప్రధానంగా నాజీ యిజానికి, ఫాసిజానికి సంబంధించినవి అయినప్పటికీ అవి కమ్యూనిస్టు వ్యవస్థలతో సహా అన్ని వ్యవస్థలకి కూడా వర్తిస్తాయి. వ్యక్తి అస్తిత్వాన్ని అంతం చేసే ప్రయత్నాలు చాలా తీవ్రంగానే జరిగాయనటానికి ఇరవయ్యో శతాబ్దం ప్రత్యక్షసాక్ష్యం. ఈ విషయాల్ని ఆ తరువాత ఫ్రామ్ తన 'May Man Prevail? అనే పుస్తకంలో రాశాడు. ఈ పుస్తకాన్ని గురించి తరువాత చూద్దాం. ముందనుకున్నట్టుగా ఇప్పుడు 'Beyond Chains of Illusion' గురించి చర్చిద్దాం.

ఆధునిక యుగకర్తలు లేక నిర్దేశకులుగా ఫ్రామ్ ముగ్గుర్ని గుర్తించాడు. వాళ్ళు ఐన్స్టీన్, మార్క్స్, ఫ్రాయిడ్. ఈ ముగ్గిరిలో ఫ్రామ్ మార్క్స్‌ని విశేషంగా కీర్తించినప్పటికీ ఫ్రాయిడ్, మార్క్స్‌ల మధ్య కొన్ని సారూప్యతల్ని చూపుతూ రెండింటినీ సమన్వయం చేసే ప్రయత్నం చేసాడు. మార్క్స్, ఫ్రాయిడ్‌లు ఇద్దరూ ప్రపంచానికి సంశయాన్ని ఒక కళగా నేర్పారు. ప్రతిదాన్ని సంశయించాలని ప్రకటించారు. ఇద్దరూ కూడా భ్రమలమీద, 'తప్పుడు భావజాలాల మీద తీవ్రదాడి చేశారు. అలాగే ఇద్దరూ వాస్తవికతని చలనశీలతని కలిగినదిగానూ, గతితార్కికమైనదిగానూ చూశారు.[8] మార్క్స్ సత్యం అనేది సామాజిక మార్పుకు పురికొల్పే అంశంగా భావిస్తే ఫ్రాయిడ్ దాన్ని వ్యక్తి మార్పుకి కారకమయ్యే సాధనంగా చూశాడు. రాజకీయ నాయకుడు సామాజిక శాస్త్రవేత్త కావాలని మార్క్స్ భావించినట్టుగా మనో విశ్లేషకుడు గొప్ప శాస్త్రవేత్త కావాలని అభిప్రాయపడ్డాడు. అంతిమంగా ఇద్దరు కూడా సత్యం మాత్రమే మార్పుకి మధ్యంగా వుంటుందనుకున్నారు. ఇద్దరుకూడా భ్రమలకి, తప్పుడు భావజాలానికి అతీతంగా మనిషి ఎదగాల్సిన అవసరాన్ని ప్రస్తావించారు. అన్నింటికంటే ముఖ్యంగా మార్క్స్, ఫ్రాయిడ్ ఆలోచనా వ్యవస్థలకి మౌలిక పునాది మానవతావాదం.[9] ఫ్రాయిడ్‌ని ఒక ఉదారవాద సంస్కర్తగానూ, మార్క్స్‌ని ఒక తీవ్ర విప్లవవాదిగా గుర్తించినప్పటికీ ఇద్దరిలో కూడా మనిషిని విముక్తి చేయాలనే అచంచల విశ్వాసం వుందనే విషయం చాలా స్పష్టంగా చెపుతాడు.

సామాజిక అంశాల్ని లేక సమాజాన్ని మాత్రమే ప్రాథమికం చేసి మనిషిని, మనిషి వైయక్తిక ప్రత్యేకతల్ని అర్థం చేసుకునే ప్రయత్నం ఏమాత్రం చేయని తాత్వికులు, ప్రధానంగా మార్క్సిస్టు తాత్వికులు తాత్విక ప్రపంచంలో మూల స్థంబాలుగా కీర్తింపబడుతున్న చారిత్రక సన్నివేశంలో ఫ్రాయిడ్‌ని, అతని సిద్ధాంతాన్ని 1950లలోనే ప్రపంచానికి మార్క్సిజంలో సంలీనం చేసే ప్రయత్నం చేశాడు ఎరిక్‌ఫ్రామ్. మనిషిని కేవలం ఒక యంత్రంగా చూసిన మార్క్సిస్టుల ఆలోచనకి మార్క్స్ ఆలోచనని కూడా మౌలిక వ్యత్యాసం వుందని ఫ్రామ్ రుజువు చేశాడు. అలాగే మార్క్స్ ఆలోచనల్ని మార్క్సిస్టులు ధ్వంసం చేసిన క్రమాన్ని, వక్ర భాష్య మిచ్చిన క్రమాన్ని బహిర్గతం చేయటమే కాక ఫ్రాయిడ్‌వాదులు చేసిన మనోవైజ్ఞాన శాస్త్రంలోని ఫ్రాయిడ్‌కి వ్యతిరేక భావాలు ఎలా వున్నాయో విశదపర్చాడు ఫ్రామ్. 'Marx Concept of Man' లో ఈ విషయాలు స్పష్టంగా చూడగలం.

ఫ్రామ్ దృష్టిలో మార్క్స్, ఫ్రాయిడ్‌లు ఇద్దరూ వాస్తవికతకు సంబంధించిన చలన శీలమైన, గతితార్కికమైన దృక్పధాల్ని ముందుకు తెచ్చారు. ఒకళ్ళు సామాజిక - ఆర్థిక విశ్లేషణ చేస్తే, మరొకళ్ళు మనో విశ్లేషణ ద్వారా తనశక్తిని ప్రదర్శించారు. అలాగే ఇద్దరూ కూడ మానవతావాద సంప్రదాయాలకి మూలాలుగా నిలిచారు. అయితే ఇద్దరికి మౌలిక వాస్తవికతకి సంబంధించిన భావనల్లో వ్యత్యాసం వుంది. ఫ్రాయిడ్ వాస్తవికతని వ్యక్తి సుప్తచేతనంలో చూస్తే మార్క్స్ సాంఘిక, ఆర్థిక నిర్మాణంలో చూడటం జరిగిందంటాడు ఫ్రామ్. ఫలితం మనిషి గురించి యాంత్రిక నమూనాను ఫ్రాయిడ్ బలపర్చితే, మార్క్స్ మనిషిని చారిత్ర ఉత్పాదనగా, చరిత్రను, తననూ కూడా మార్చుకునే శక్తి

కలవాడుగా చిత్రించాడు. ఫ్రాయిడ్ చిత్రించిన మనిషి వ్యక్తిగతంగా, సుప్తచేతన దశలనుంచి రూపొందిన క్రమం తనని తాను నాగరికతలోకి తెచ్చుకుంటూ వుంటాడు. మార్క్స్ చిత్రించిన మనిషి చారిత్రకంగా, గతి తార్కికంగా రూపొందినవాడు. తనవైయక్తిక పరిణామానికి సామాజిక పరిణామానికి విడదీయలేని సంబంధం వుందని మార్క్స్ ప్రతిపాదన. ఇద్దరి ప్రతిపాదనల్నీ దాదాపు అంగీకరించిన ఫ్రామ్ ఈ రెండింటిని సమన్వయం చేసే గొప్ప ప్రయత్నంలో వున్నా ఆచరణలో వాటిని సమ్మిళితం చేసి ఒక కొత్త సిద్ధాంత రూపకల్పన చేయటంలో విజయవంతం అయినట్టు కన్పించడు. అయితే మార్క్సిజానికి ఫ్రాయిడ్‌వాదం కొంత కొత్త దర్శనికతని ఇవ్వగలదని, మార్క్సిజపు పరిమితుల్ని కొంతవరకు అధిగమించటానికి ఉపకరించగలదని ఫ్రామ్ నమ్మాడు.

ఫ్రామ్ ప్రకారం మార్క్స్ ఆలోచనా సరళిని చాలామంది మార్క్సిస్టులనుకునేవాళ్ళు గందరగోళ పర్చారు. మార్క్స్‌ని అనేక రూపాల్లో తప్పుగా వ్యాఖ్యానించారు. మార్క్సిస్టుల చేతుల్లో మార్క్స్ ఒక యాంత్రిక నిశ్చయవాదిగా (Positivistic - Mechanist) గా మార్చివేయబడ్డాడు. మార్క్స్ ఆలోచనల్ని మనిషిని నియంత్రించటానికి, వికృతపర్చటానికి చాలా విస్తృతంగా వాడుకోవటం జరిగింది. ఏ మత విలువలకి, ఆత్మిక సంప్రదాయాలకి మార్క్స్ భావాలకి పొసగదని చెప్పటం జరిగిందో, ఏ విలువలు, అభిప్రాయాలు సమర్థించటానికి మార్క్స్‌ని నిందించారో అదే మార్క్స్ భావాల్ని పెట్టుబడిదారీ సమాజం అనివార్యమని, పెట్టుబడిదారీ విధానానికి మానవ ప్రవృత్తికి దగ్గర సంబంధం వుందని రుజువు చేయటానికి కూడా వాడుకోవటం జరిగింది. నిజానికి మార్క్స్, హెగెల్‌లాగా తాత్విక ఆదర్శవాది కానీ, లోప భూయిష్టమైన భౌతికవాది కానేకాదు. మనిషిని గురించిన సమగ్ర అవగాహనతో కూడిన ఒకానొక తాత్విక సిద్ధాంతానికి మార్క్స్ రూపకల్పన చేశాడు అని ఫ్రామ్ ప్రకటించాడు.

తన ఆలోచనలకి కూడా మౌలిక ప్రేరణ మార్క్స్ అని స్పష్టంగా ప్రకటించుకున్న ఫ్రామ్ పెట్టుబడిదారీ విధానాన్ని మౌలికంగా తప్పు ప్రకటించాడని దీనికి కారణం పెట్టుబడిదారీ విధానం కేవలం అన్యాయబద్ధమైన వ్యవస్థ కావటం మాత్రమేకాక శ్రమని అది అర్థరహిత చర్యగా మార్చివేస్తుందని, ఆక్రమంలో మనిషిని విధ్వంసం చేస్తుందనే గుర్తింపు మార్క్స్‌కి వుండటమని ఫ్రామ్ నిర్ధారించాడు. పెట్టుబడిదారీ సమాజంలో శ్రమ పరాయీకరింప బడుతుందని, శ్రమ మనిషి ప్రవృత్తి కాకుండా పోతుందని, మనిషి తానే రూపొందించుకున్న వస్తువులు, పరిస్థితులు అంతిమంగా పెట్టుబడిదారీ విధానంలో మనిషిని నిర్దేశిస్తాయని ఫ్రామ్ భావించాడు. భావాలు, కళలు అన్ని కూడా ఈ క్రమంలో ధ్వంసం చేయబడతాయని, ఈ విషయాన్ని గురించి పూర్తి ఎరుకలోంచి మార్క్స్ రాశాడని చెప్తూనే ఎరిక్ ఫ్రామ్ మార్క్స్ పరిమితుల్ని కొన్నింటిని చెప్పటానికి వెనుకాడడు. మార్క్స్ పరిమితుల్ని ఎరిక్ ఫ్రామ్ కంటే ఫ్రాంక్‌ఫర్ట్ స్కూల్ సభ్యులు హెర్బర్ట్ మార్క్యూజ్, అదార్నో లాంటివాళ్ళు చాలా స్పష్టంగా విశదీకరించినప్పటికీ ఎరిక్ ఫ్రామ్ తన స్థాయిలో తాను కొన్ని అంశాల్ని గుర్తించ గలిగాడు.

ఇరవయ్యో శతాబ్దాన్ని నియంత్రించగలిగే స్థితికి చేరుకున్న మధ్య తరగతి అస్తిత్వాన్ని మార్క్స్ వూహించ లేక పోయాడు. అలాగే పరాయికరణ దాని తీవ్రరూపం దాల్చుతుందని, అది మొత్తం ప్రజానీకాన్ని, నియంత్రించగలుగుతుందని మార్క్స్ గ్రహించలేకపోయాడు. అలాగే '1844 నుండి మార్క్స్ ఆలోచనలు మారటం ప్రారంభమయింది. ఈ విషయాన్ని 1880ల నుంచి మార్క్స్ రాసుకుంటూ వచ్చిన నోట్సులు చూడవచ్చు. మార్క్స్ మరణం తరువాత చాలా కాలానికి 1930లలో

ముద్రింపబడిన '1844 Philosophical Manuscripts' లో ఈ విషయం మనకు తెలుస్తుంది. ఈ మార్పుకి కారణం భావవాద పరిభాషలో, మత సంబంధ భావనల్తో మనిషి అర్థం చేసుకోవటం కుదరదని, ఇవి ఆర్థిక, సాంఘిక అంశాల్ని మరుగు పర్చుతాయనే గుర్తింపు మార్క్స్, ఎంగెల్స్‌లకు వుందనే విషయాన్ని ఫ్రామ్ రుజువు చేశాడు. ఈ స్ఫృహవల్లే ఆ తరువాత రచనల్లో మార్క్స్, ఎంగెల్స్‌లు 'Specis, human nature' లాంటి పదాల్ని ఉపయోగించలేదని ఫ్రామ్ అంటాడు. అలాగే మార్క్స్‌కి సోషలిజం ఒక సాధనం తప్ప లక్ష్యం కాదని కూడా ఫ్రామ్ నిర్ధారణ.

అయితే '1844 Philosophical Manuscripts' ప్రచురణ తరువాత చాలామంది మార్క్సిస్టు మేధావులు మార్క్స్‌లో రెండు దశల్ని గుర్తించారు. తొలిదశకి, మలిదశకి మౌలికమైన మార్పు వుందని రుజువు చేశారు. మలిదశ మార్క్స్ మరింత పరిపక్వత చెందిన మార్క్స్‌గా వీళ్ళు అభి వర్ణిస్తే ఫ్రామ్ అందుకు భిన్నంగా మార్క్స్ ఆలోచనల్లో ఒక ఏకధారను గుర్తించాడు. మానవ ప్రవృత్తి గురించిన మార్క్స్ భావనని ఆధారంగా చేసుకుని ఫ్రామ్ తనని మరింత విస్తరించే ప్రయత్నం చేశాడు.[10] వీటన్నింటికంటే ఎక్కువ సమకాలీన సామాజిక వ్యవస్థల స్వరూప స్వభావాల్ని చాలా లోతుగా అధ్యయనం చేసే ప్రయత్నం చేయటమే కాకుండా వాటిని చాలా సునిశితంగా విశ్లేషించాడు ఫ్రామ్.

ఎరిక్ ఫ్రామ్ ప్రకారం అమలులో వున్న వ్యవస్థలు తమ మనుగడను కొనసాగించటం కోసం వ్యక్తికి సంబంధించిన ఒక నమూనాని తయారు చేశాయి. వాటి వాటి ఆర్థిక, సాంఘిక వ్యవస్థల అస్తిత్వానికి ఈ నమూనాలు అవసరం. శ్రమలో నిబద్ధత, క్రమం (Order) అనేవి వ్యక్తి అంతరాళాలలో నాటుకునేట్టును ఈ వ్యవస్థలు రూపొందించుకున్నాయి. మనిషి సుప్తచేతనాన్ని ఈ వ్యవస్థలు నిర్దేసించేటట్టుగా వ్యక్తిని నిర్మించుకున్నాయి. సామాజిక క్రమాన్ని గాని దాని ఆర్థిక, సాంఘిక తీరుతెన్నులు కానీ వ్యక్తి ఏ దశలోనూ అర్థం కాకుండా వుండేందుకు వాటిని సంక్లిష్ట వ్యవస్థలుగా మార్చివేశాయి. ఫలితంగా ఈ వ్యవస్థల్లో వ్యక్తి స్వేచ్ఛ అనేది ఒక భ్రమగానే మిగిలిపోయింది. ఫ్రామ్ పెట్టుబడిదారీ మార్కెట్ వ్యవస్థలు ఎన్ని లోపాల్ని ఎత్తి చూపించినప్పటికీ వర్గ సమాజంలో మిగతా ఏ పంపిణీ వ్యవస్థకన్న పెట్టుబడిదారీ స్వేచ్ఛా మార్కెట్ పంపిణీ వ్యవస్థ మెరుగయినదిగా గుర్తించాడు. ఈ మార్కెట్ వ్యవస్థలు వ్యక్తి కనీసం తన రాజకీయ స్వేచ్ఛని వ్యక్తపర్చేందుకు అవకాశం వుందనేది ఫ్రామ్ అభిప్రాయం. సామాజిక మార్పుని విప్లవాత్మకంగా కోరుకునే వాళ్ళని ఫ్రామ్ భావాలు సంస్కరణవాద భావాలుగా అనిపించవచ్చు. కానీ ఈ సందర్భంలో పెట్టుబడిదారీ విధానపు రద్దుని పరిణామాత్మకంగా కోరుకున్న ఎరిక్ ఫ్రామ్ ఆలోచనకి పై అభిప్రాయం చాలా తార్కికంగా అన్పిస్తుంది.

పరాయికరణకు కారణమయ్యే అనేకానేక అంశాలలో దానికోసమే అదిగా వుండే లాభాన్ని కూడా ఒక కారణంగా గుర్తిస్తాడు. నిజానికి అది మౌలిక లేక ప్రాథమిక కారణంగా భావిస్తాడు ఫ్రామ్. అత్యాశే (Greed) లాభాపేక్షకి మూలం. ఈ లాభసూత్రాన్ని (Profit Principle) సమర్థించుకోవటం కోసం పెట్టుబడిదారులు అనేక సమర్థనలు కనుగొన్నారు. వినిమయ సామాజిక వ్యవస్థల్ని విశ్లేషించటంలో మార్క్యూజ్, అదార్నో, హర్క్‌హైమర్ లాంటివాళ్ళు విశేష శక్తియుక్తుల్ని ప్రదర్శించారు. అంతేస్థాయిలో ఈ వినిమయ వ్యవస్థల్ని విశ్లేషించగలిగాడు ఫ్రామ్.

ఫ్రామ్ పరాయీకరణని కేవలం శ్రమ, ఉత్పత్తిలాంటి అంశాలకు మాత్రమే పరిమితం చేసి (చాలామంది మార్క్సిస్టులు అలాగే చూస్తారు) చూడలేదు. వినిమయ వ్యవస్థకి దాన్ని అనువర్తింపజేసి చూశాడు ఫ్రామ్. వినిమయం చేయాలనే వాంఛని వ్యక్తుల్లో నిరంతరం అమలులో వున్న వ్యవస్థలు

రేకెత్తిస్తూ వుంటాయి. ఇక మనుషులు వాటిని పొందటం కోసం తహ తహలాడుతూ వుంటారు. ఈ స్థితిలో అమలులో వున్న వినిమయ వ్యవస్థని కానీ లేక మిగతా సామాజిక వ్యవస్థల్ని కానీ వాటి వాటి నిజ రూపాల్లో ఈ వ్యక్తి గ్రహించలేకపోతాడు. అలాగే వ్యక్తి తన స్వతంత్ర ఆలోచనాశక్తిని కోల్పోతాడు. వ్యక్తి తన ప్రత్యేకతను కోల్పోయి ఒక మందలో ఒకడిగా మారిపోతాడు. ఈ క్రమంలో వ్యవస్థకి అనుసంధానం చేయబడతాడు. వ్యక్తిలో ప్రాథమికంగా వుండే లక్షణాలన్నీ కోల్పోవటం జరుగుతుంది. అహం పతనం కావటం మొదలయి అంతిమంగా అది అంతర్ధానమవుతుంది. వ్యక్తి స్వేచ్ఛాయుత ఆలోచనని చాలా ఉదాసీనంగా కోల్పోతాడు. నైతిక విలువలు మృగ్యమవుతాయి. శ్రమ అనేది దాని సృజనాత్మకతను కోల్పోయి నిస్సారంగా అనిపిస్తుంది. శ్రమ పరాయి కరణ పొందిన స్థితిలో మిగిలే ఒకే ఒక్క ప్రత్యామ్నాయం పెట్టుబడిని కూడబెట్టుకోవటమే, అంటే ఇతరుల్ని దోపిడీ చేయటమే అంటాడు ఫ్రామ్.

ఈ పై నేపథ్యంలో మానవజాతిని పెట్టుబడి ఆధిపత్యం నుంచి, తద్వారా పరాయీకరణ నుంచి విముక్తం చేయటం అవసరం అంటాడు ఫ్రామ్. పంతొమ్మిదవ శతాబ్దపు సోషలిజపు కనీసపు లక్ష్యం ఇదేనని కూడా అంటాడు. ఈ లక్ష్యం కమ్యూనిస్టు వ్యవస్థలలో కూడా సాధించబడలేదు. సారాంశంలో సోషలిస్టు సూత్రాలు ధ్వంసం చేయబడటం తప్ప ఆదేశాలలో జరిగిందేమిలేదు. ప్రజాస్వామిక సోషలిజం మానవతావాద సోషలిజం అనేవి ఇవ్వాల్టి లక్ష్యాలుగా వుండాలనేది ఫ్రామ్ వాదన. ఈ క్రమంలోనే సోవియట్ రష్యామీద తీవ్ర విమర్శ పెట్టాడు. సోవియట్ రష్యా విప్లవాత్మక వ్యవస్థ కానీ, నిజమైన సోషలిస్టు వ్యవస్థ కానీ కాదని, అదికూడా సంప్రదాయ బద్ధమైన వర్గనిర్మాణంతో కూడిన సమాజమని, మిగతా పాశ్చాత్య వ్యవస్థలకి సోవియట్ యూనియన్‌కి వ్యత్యాసమేమీ లేదని ప్రకటించాడు ఫ్రామ్. అసలు లెనిన్ మరణం తరువాత రష్యాలో కొనసాగింది పచ్చి నియంతృత్వమని ఫ్రామ్ భావం. ఈ విషయాల్ని మరింత లోతుగా ఫ్రామ్ తన 'May Man Prevail' అనే రచనలో చర్చించాడు.

ఇంతవరకు నడిచిన సమాజ చరిత్రని మార్క్స్ వర్గ పోరాటాల చరిత్ర చూస్తే సమాజంలో జరిగిన మార్పులన్నీ హింసాపూరితంగా జరిగాయని, ప్రణాళికా బద్ధంగా, హేతుబద్ధంగా వాటిని అవి సరిదిద్దుకోలేక దారుణంగా అంతమయిన గొప్ప సంస్కృతుల స్మశాన స్థలమే మనిషి చరిత్ర అంటారు ఫ్రామ్.[11]

మొదటి ప్రపంచ యుద్ధం తరువాత మానవ జాతి ఒక కొత్త దశలోకి ప్రవేశించిందంటాడు ఫ్రామ్. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో మౌలిక మార్పులు చేసుకోవటం జరిగింది. పంతొమ్మిదవ శతాబ్దానికంటే భిన్నంగా శాస్త్ర, సాంకేతిక రంగాల్లో తీవ్ర అభివృద్ధి జరిగింది. ఫలితంగా భౌతిక వస్తు సముదాయపు ఉత్పత్తి అనూహ్యంగా పెరిగింది. కొత్త సాంకేతిక పరిశోధనలు కొత్త ఉత్పత్తి రూపాల్ని రంగం మీదకి తెచ్చాయి. పెద్ద పెద్ద పరిశ్రమల్లో ఉత్పత్తి కేంద్రీకృతం కావటం జరిగింది. ఈ పరిశ్రమల్ని నియంత్రించే కొత్త మేనేజర్ల పెత్తందారీ వ్యవస్థ ఒకటి రూపు దిద్దుకుంది. ఈ మేనేజర్లు పరిశ్రమాధిపతులు కారు. ఎంతో కొంత సహకారం వీళ్ళకి కార్మికుల నుంచి లేక పనివాళ్ళనుంచి లభిస్తుంది. కార్మిక సంఘాల మద్దత్తు కూడా వీళ్ళకి వుంటుంది. ఈ కార్మిక సంఘాల పనితీరు నిర్మాణం కూడా మేనేజర్ల వ్యవస్థని పోలి వుంటుంది. కేంద్రీకృతత్వం, పెత్తందారీతనం మొదలైనవి ఈ కొత్త ఉత్పత్తి విధానపు లక్షణంగా కార్మికుల జీవన విధానంలో ఈ క్రమం ఎంతో కొంత మార్పుని తీసుకురాగలిగింది. అలాగే వాళ్ళ జీవితాలు ఎంతో కొంత మెరుగుపడటం జరిగింది.

ఈ పై క్రమానికి భిన్నంగా పంతొమ్మిదవ శతాబ్దిలో పెట్టబడిన భారీ పరిశ్రమలు అందులో పనిచేసే కార్మికుల, పిల్లల, స్త్రీల జీవితాలను గురించి ఏమాత్రం పట్టించుకోకుండా వేలాది మందిని దుర్భర దారిద్ర్యంలోకి నెట్టటం జరిగింది. ఈ స్థితి సోషలిస్టు భావజాల వ్యాప్తిని సుగమం చేసింది. అయితే ఈ స్థితి ఇరవయ్యో శతాబ్దంలో మౌలిక మార్పుకు గురయింది. ఈ మార్పు మొదటి ప్రపంచ యుద్ధం తరువాత హింసాపూరితమయిన మార్పుల్ని అసాధ్యం చేసింది. ఐరోపా ఖండం మొత్తానికి ఇది వర్తిస్తుంది. బాగా ఆర్థికంగా వెనుకబడ్డ లాటిన్ అమెరికన్, ఆఫ్రికన్ దేశాలలో తప్ప అటువంటి హింసాయుత మార్పులు వచ్చే అవకాశం లేదు అని అంటాడు ఫ్రామ్. వెనుకబడ్డ దేశాల్లో విప్లవాకాశాలున్నాయని భావించిన ఫ్రామ్ నాలుగు దశాబ్దాల క్రితం వ్యక్తం చేసిన తన భావాన్ని ఇవ్వాళ ఉన్నట్టయితే తప్పకుండా వెనక్కి తీసుకుని వుండి వుండేవాడు. నిజానికి అప్పుడు కూడా ఈ వెనకబడ్డ దేశాలలో విప్లవాలు శాంతి యుతంగా సంభవించే అవకాశమేదయినా వుంటుందేమోనని ఆశించాడు ఫ్రామ్.

ఇంతకు ముందే చెప్పుకున్నట్టుగా 'May Man Prevail?' అనే గ్రంథంలో సోవియట్ వ్యవస్థని, విప్లవాన్ని చాలా సునితంగా విశ్లేషించాడు. నాజీ యిజాన్ని, హిట్లర్‌ని విశ్లేషించినట్టుగానే, సోవియట్ వ్యవస్థని, స్టాలిన్‌ని విశ్లేషించాడు. అలాగే సోషలిజానికి మార్క్స్ ఇచ్చిన నిర్వచనాలకి, ఆరోజుకు రష్యాలో అమలులో వున్న సోషలిజానికి మౌలిక వ్యత్యాసాన్ని ఫ్రామ్ బహిర్గతం చేశాడు. రష్యాని కానీ, చైనాని కానీ మార్క్స్ సోషలిస్టు దేశాలుగా అంగీకరించి వుండేవాడు కాదంటాడు ఫ్రామ్. సకల రంగాలలో వ్యక్తి మూర్తిమత్వాన్ని విస్మరించిన వ్యవస్థలను సోషలిస్టు దేశాలుగా పిలవటం అర్థరహితం అని ఫ్రామ్ భావన. మనిషిలోని అహేతుబద్ధ వాంఛల్ని, వాటి సంక్లిష్టతల్ని, వ్యక్తుల్ని తమని బాధ్యతల్నించి విముక్తం చేసే వ్యవస్థల్ని, తన స్వేచ్ఛని హరించి వేసే వ్యవస్థల్ని అంగీకరిస్తారనే విషయాన్ని మార్క్స్ అవగతం చేసుకోలేకపోయినప్పటికీ వ్యక్తి మూర్తిమత్వాన్ని హతం చేయటం కానీ, సోషలిజం అంటే మనుష్యులనందరిని సమానం చేయటంగా కానీ మార్క్స్ ఎప్పుడూ అంగీకరించలేదు. మార్క్స్ భావాల్ని రష్యన్లు భావజాలాలుగా మార్చివేశారు. ఫలితంగా మార్క్స్ ఆలోచనలకి విరుద్ధమైన ఆచరణలు రష్యన్ సమాజంలో జరిగాయి. భావజాలాలు సారాంశంలో ప్రజల్ని ఒక అంశానికి బందీలను చేసి అంతిమంగా వాళ్ళని అణిచివేసే క్రమం సజావుగా జరిగింది. ఈ క్రమంలో స్టాలిన్ పాత్రని చాలా శక్తివంతంగా విశ్లేషించాడు ఫ్రామ్.

స్టాలిన్ సోషలిస్టు విప్లవం పేరుతో సోషలిజాన్ని అంతం చేశాడు. రష్యాని పారిశ్రామిక దేశంగా మార్చే క్రమంలో అనూహ్యమయిన హింసని ప్రజలమీద ప్రయోగించాడు. నిత్యావసర వస్తువుల ఉత్పత్తి తగ్గించి భారీ పరిశ్రమల మీద దృష్టి కేంద్రీకరిస్తున్న సమయంలో ప్రజల అసంతృప్తిని, అసమ్మతిని అణిచివేయటంలో దారుణ నిర్బంధాన్ని ప్రజలపై రుద్దాడు. ఇదే క్రమంలో తన రాజకీయ ప్రత్యర్థుల్ని అంతమొందించటానికి కూడా వెనుదీయలేదు. పాత విప్లవ జ్ఞాపకాల్ని ప్రజల మనస్సుల నుండి తుడిచివేసే లక్ష్యంతో చరిత్రని తిరగరాయటానికి కూడా స్టాలిన్ వెనకాడలేదు. సోషలిస్టు భావాల్ని ధ్వంసం చేసి హిట్లర్‌లాగా ప్రవర్తించాడు. స్టాలిన్ తరువాత కూడా రష్యన్ సమాజ స్థితిని ఫ్రామ్ విశ్లేషించాడు. కనీసం 1960ల వరకు రష్యా సోషలిస్టు వ్యవస్థగా వుందని చాలామంది కమ్యూనిస్టులు భ్రమ పడినట్టుగా ఫ్రామ్ భ్రమపడలేదు. అతని దృష్టిలో అసలు 1923 తరువాత రష్యన్ విప్లవ వ్యవస్థ లేదు. మిగతా ప్రపంచంలో విప్లవాలకి కూడ అది సహకరించలేదు. పైగా నిలువరించేందుకు ప్రయత్నించచదని ఫ్రామ్ అభిప్రాయం. నిరంతరం ప్రపంచంలో కమ్యూనిజపు అంతిమ విజయం

అనివార్యమని రష్యా ప్రకటిస్తూ రావటం ఒక వ్యతిరిక్తమని, నిజానికి ఈ క్రమం భావాలు భావజాలాలుగా దిగజారిన ఫలితమని, రష్యా మార్క్సిజం దాని మొరటు రూపంలో భావజాలంగా మారి గొప్ప విధ్వంసానికి దారి తీసిందని ఫ్రామ్ నిర్ధారించాడు.

ప్రపంచ వ్యాప్తంగా కమ్యూనిస్టు పార్టీలు రెండవ ప్రపంచ యుద్ధం తరువాత కాలానికి తీవ్ర సంక్షోభంలో కూరుకుపోయాయి. సోషలిస్టు దేశాలలో జరిగిన హింస, అణిచివేతలు బయట ప్రపంచానికి ఎక్కువ తెలియనప్పటికీ తెలిసినంతవరకయినా మిగతా ప్రపంచాన్ని భయకంపితం చేసింది. ఈ నేపధ్యంలో ప్రపంచ వ్యాప్తంగా కమ్యూనిస్టు వ్యవస్థల మీద మాత్రమే కాకుండా అసలు మార్క్సిజం మీదనే పునర్మూల్యాంకనాలు ప్రారంభమయ్యాయి. అలాగే రెండవవైపు మార్క్సిజాన్ని, దాని చారిత్రక పరిమితుల్ని సరిదిద్దే ప్రయత్నం జర్మనీలోని ప్రముఖ మార్క్సిస్టు అధ్యయన సంస్థ ఫ్రాంక్ఫర్ట్ స్కూల్ సభ్యులు చేశారు. అయితే దాదాపు అన్ని సోషలిస్టు వ్యవస్థలు ఈ స్కూల్ సభ్యుల్ని మార్క్సిస్టు వ్యతిరేక బృందంగా చిత్రించి ఖండించాయి. ఫలితంగా మార్క్సిజాన్ని ఒక సజీవ తాత్విక, సామాజిక సిద్ధాంతంగా నిలపాలని ఈ స్కూలు సభ్యులు చేసిన ప్రయత్నాలు వమ్మయ్యాయి. ఈ స్కూలుకి చెందిన ఎరిక్ ఫ్రామ్ ఆలోచనలకి కూడా దాదాపు అదే గతిపట్టింది. ఫ్రాంక్ఫర్ట్ స్కూలు సభ్యులు చేసిన అధ్యయనాన్ని సోషలిస్టు ప్రపంచం పరిగణనలోకి తీసుకుని తమ సైద్ధాంతిక అవగాహనల్ని, సరిదిద్దుకున్నట్లయితే సోషలిజం ఇవ్వాళ ఇంత సమస్యాత్మక అంశంగా మనముందు నిలిచి వుండివుండేదికాదు. ఈ పై క్రమాన్ని గుర్తించిన ఎరిక్ ఫ్రామ్ సోషలిజాన్ని మానవత్వపు ప్రాతిపదికగా పునర్నిర్మించే ప్రయత్నం చేశాడు. అయితే ఫ్రామ్ పునర్ నిర్మాణంలో అమూర్తత నిండి వుండటం వల్ల అది అంతగా విజయవంతం అయినట్లు అనిపించదు.

ఫ్రామ్ మనిషిలోని హేతుబద్ధతని మితిమీరి విశ్వసించాడు. అహేతువుని సరిగా ఉపయోగించుకోని జనం మీద కూడా అప్పుడప్పుడు అసహనాన్ని ప్రదర్శించాడు. 'భవిష్యత్ దృష్టిలేని చోట ప్రజలు నశించిపోతారు' అనే నమ్మికలోంచి తాను నిర్మించుకున్న ఊహాత్మక వ్యవస్థ తన కళ్ళముందు ధ్వంసమవుతూ వున్న క్రమానికి ఫ్రామ్ చలించి పోయాడు. అందువల్లే తన రచనల్లో మితిమీరిన ఉద్వేగం కన్పిస్తుంది. ఊహాత్మకతవాదాన్ని Moderate మరియు Radical ఊహాత్మకతావాదాలుగా విడగొడితే ఫ్రామ్ Moderate ఊహాత్మకతావాదిగా అనిపిస్తాడు. ఈ Moderate దృక్కోణము తన చుట్టూ వున్న తాత్వికులంతా , ఉదాహరణకి హెర్బర్ట్ మార్క్యూజ్, థియోడర్, అదార్నో లాంటి వాళ్ళందరు, తమ సమకాలీన సమాజాల్ని చూసి నిరాశ నిస్పృహల్లోకి కూరుకుపోతున్న సందర్భంలో తాను మాత్రం గొప్ప ఆశావాదంతో సోషలిస్టు మానవతావాదాన్ని ప్రవచించాడు. ఫ్రామ్ మానవతా వాదంలో కూడా ఊహాత్మకతా వాదానికి తక్కువ స్థానమేమీలేదు. ఫ్రామ్ కొన్ని ప్రతిపాదనలు ఆచరణ యోగ్యమనిపించవు. హేతువుని సంశయిస్తూ మనిషిలో అనుభవ కోణాన్ని ముందుకు తీసుకువచ్చిన ఫ్రామ్‌లో కూడా అక్కడక్కడ ఇంతకు ముందే చెప్పుకున్నట్టు హేతువు అనుభవాన్ని అధిగమించటం కన్పిస్తుంది. అమెరికా నుంచి ఫ్రామ్ రాసిన రాతలు తానున్న చారిత్రక సందర్భంలో ఎక్కువ భాగం అమెరికన్ విదేశీ విధానానికి మద్దత్తుగా ఉపయోగపడుతున్నాయేమోనన్న సందేహం కూడా ఫ్రామ్‌కి కలిగినట్టు కన్పించదు. ముఖ్యంగా తన 'May Man Prevail?' అనే రచనలోని మొదటి భాగంలోనూ, ఆ తరువాత సోవియట్ రష్యామీద పెట్టిన విమర్శలోనూ ఫ్రామ్ అమెరికన్ సామాజిక వ్యవస్థకి అచేతనంగా ముగ్ధుడయినట్టు కన్పిస్తాడు. అలాగే మానవ agression గురించి ఫ్రామ్ చేసిన ప్రతిపాదనల్లో కూడా మితిమీరిన తార్కికత కన్పిస్తుంది. ఏ అంశాలయితే మార్క్సిజపు బలహీనతలుగా లేక పరిమితులుగా ఫ్రామ్ గుర్తించాడో ఆ బలహీనతలకి తాను కూడా గురవ్వటం అక్కడక్కడా కన్పిస్తుంది.

మానవ ప్రవృత్తి గురించి ఫ్రామ్ చేసిన నిర్ధారణలో అంతిమంగా మార్క్స్ ప్రతిపాదనలకి కొనసాగింపుగా అనిపించినా చాలా సందర్భాలలో ముఖ్యంగా మనిషి శారీరకంగా కలిగి వుండే లక్షణాల్ని ప్రస్తావించే సందర్భంలో ఫ్రామ్ ఆలోచనలు కొంత గందరగోళంగా అనిపిస్తాయి. స్థిర మానవ ప్రవృత్తిని ఫ్రామ్ నిర్ద్వంద్వంగా నిరాకరించినా మానవ శరీరంలో దాని బీజాల్ని వెతికే ప్రయత్నం ( ఇది అచేతంగానే కావచ్చు) కన్పిస్తుంది. అలాగే మార్క్స్, ఫ్రాయిడ్‌ల గొప్పతనాన్ని నిర్వచించే క్రమంలో ఫ్రామ్ స్థితి కొంత గందరగోళంగా వుంటుంది. ఒక సదర్భంలో ఇద్దర్ని ఒకే పీఠం పై నిలిపి మరొక సందర్భంలో ఫ్రాయిడ్ మార్క్స్‌తో సరితూగలేడంటాడు. స్టాలిన్, హిట్లర్‌ల మూర్తిమత్వాల విశ్లేషణలో ఫ్రామ్ ఆయా సమాజాల్లో జరిగిన మొత్తం దారుణాలకి ఈ ఇద్దర్ని మాత్రమే బాధ్యుల్ని చెయ్యటంలో కూడా ఫ్రామ్ చారిత్రక అవగాహనలో లోపంగా అన్పిస్తుంది. స్టాలిన్ తన అధికార దాహంతో మొత్తం రష్యన్ సమాజాన్ని నిర్దేసించ గలిగాడనటం కూడా సత్యదూరమే. భావాల్ని భావజాలంగా మార్చే క్రమంలో వ్యక్తులు దారుణమైన పాత్రనే నిర్వర్తించవచ్చు, అంతమాత్రం చేత ఆ భావాలు పరిశుద్ధమయినవిగా, దాన్ని వాడుకున్నవాళ్ళు, ప్రచారం చేసిన వాళ్ళు విద్రోహులుగా చూడటం కూడా సరికాదు. మార్క్స్ పరిశుద్ధ ఆత్మ, మార్క్సిస్టులు మార్క్స్‌ని వికృత పర్చారనే ఫ్రామ్ వైఖరి కూడా సరికాదు. మార్క్స్ చారిత్రక పరిమితుల్ని సరిగానే గుర్తించిన ఫ్రామ్ ఆ విషయాన్ని చాలా సందర్భాలలో మర్చిపోతూ వుండటం కన్పిస్తుంది. అయితే ఒకందుకు ఫ్రామ్‌ని మెచ్చుకోకుండా వుండలేం. అదేమంటే గొప్ప సాంకేతిక స్వామ్య వ్యవస్థ అయిన అమెరికాలో వుండి తన ఊహాత్మకతావాదాన్ని ఏ మాత్రం వదులుకోకుండా నిలబడగలగటం అనేది నిజంగా ఆయనలో ఆశ్చర్యం గొలిపే అంశం.

ఊహాత్మకతావాదాన్ని John H. Schaar అనే ఆయన సాంకేతిక ఊహాత్మకతా వాదం Technological Utopianism) సామాజిక ఊహాత్మకతావాదం (Sociological Utopianism) అని రెండు రకాలుగా విభజించాడు. మొదటి తరహా ఊహాత్మకతావాదం సమాజాన్ని కొన్ని సాంకేతిక జిమ్మిక్కుల ద్వారా మౌలికంగా మార్చి వేయటం జరుగుతుందని ప్రచారం చేస్తూ వుంటుంది. దీన్ని ఇంగ్లీషులో 'Techtopia' అంటున్నారు. యంత్రం వీళ్ళ సామాజిక మార్పులో చోదకశక్తి. ఇది సైన్స్ ఫిక్షన్‌ని పోలివుంటుంది. మానవ భావుకత్వపు స్పర్శ ఈ సాంకేతిక ఊహాత్మకతావాదం ఏమాత్రం వుండదు. దీనికి భిన్నంగా ఫ్రామ్ పంతొమ్మిదోవ శతాబ్దపు సోషలిస్టు పరిమితుల్ని అధిగమించి మానవీయమైన సోషలిజాన్ని గురించి తపించాడు. ఆ క్రమంలో తన సామాజిక ఊహాత్మకత వాదుల కోవలోనే మిగిలాడు. అయితే కొన్ని సందర్భాల్లో ముఖ్యంగా 'The Sane Society' లాంటి పుస్తకాల్లో ఫ్రామ్ వ్యక్తపర్చిన అభిప్రాయాలు మళ్ళీ కొంత గందరగోళంగా అన్పిస్తాయి. రసాయన శాస్త్రవేత్తలు, భౌతిక శాస్త్రవేత్తలు తమ సమస్యల్ని శాస్త్ర రంగంలో పరిష్కరించినట్టుగా సామాజిక సమస్యల్ని కూడా పరిష్కరించటం అసాధ్యం కాదని ధ్వనింపజేస్తాడు.

ఏ సామాజక శాస్త్రకారుడయినా తానున్న భావ వాతావరణాన్ని అధిగమించి ఎంత బాగా ఆలోచించ గలిగాడనే విషయాన్ని ప్రాతిపదిక చేసుకుని తాత్విక ప్రపంచంలో లేక సామాజిక శాస్త్ర రంగంలో అతని స్థానాన్ని నిర్ధారించటం జరుగుతుంది. అలాచూసినప్పుడు ఫ్రామ్ నిర్వహించిన పాత్ర చిన్నదేమీ కాదు. మార్క్సిజం, మార్క్సిస్టులు ఒకానొక సంప్రదాయ వరవడిలో పడికొట్టుకు పోతున్నప్పుడు, ఎవరికి తోచినట్టుగా వాళ్ళు తమ అవసరాలకి అనుగుణంగా దాన్ని మలచుకుంటున్నప్పుడు తాను 'శాస్త్రీయ' మనుకున్న ఒకానొక మార్క్సిజాన్ని ముందుకు తెచ్చి దాన్ని కేంద్రం చేసుకొని సామాజిక

వ్యవస్థల్ని విశ్లేషించే ప్రయత్నం చేశాడు. అలాగే మనో వైజ్ఞానిక శాస్త్ర స్పర్శలో మార్క్సిజాన్ని సుసంపన్నం చేయవచ్చునని గాఢంగా నమ్మి ఆచరించాడు. పాశ్చాత్య ప్రపంచంలో ఫ్రామ్ అభిప్రాయాలకి ఎంత ప్రాసంగికత వుందో చెప్పలేం. నిజానికి అటువంటి అవకాశం, అవసరం వున్నట్టు లేదు. అయితే భారతదేశంలో కనీసం, తెలుగుదేశంలో, 'ఫ్రాయిడ్ సిద్ధాంతవేత్త కాదు, ఫ్రాయిడ్‌ది అసలు సిద్ధాంతమే కాదు' (ఈ మధ్య ఒక ప్రముఖ విరసం నాయకుడిచ్చిన నినాదం ఇది) అంటున్న చరిత్ర సందర్భంలో ఎరిక్ ఫ్రామ్ అవసరం ఎంతయినా వుంది. మార్క్స్ మాత్రమే సర్వజ్ఞుడు అనుకునే వాళ్ళని వాళ్ళ విశ్వాసానికి వదిలివేసి ఎరిక్ ఫ్రామ్ చెప్పిన ఈ మాటల్ని మాత్రం నిరంతరం గుర్తుంచుకుందాం - "Reason,man's blessing, is also his curse, it forces him to cope everlastingly with the task of solving an insolvable dichotomy".

NOTES:

1. Freud coming from another direction, out of neurology and psychiotry, met the sociologists half-way. All psychology, he once remarked, is social psychology-because all of it is interaction between culture and the individual." John H. Schaar, 'Escope from Authority: The perspectivies of Erich Fromm, Basic Books, Inc. New York.
2. "It (The Psychology of Marxism) had however, considerable impact on Fromm, whose oven efferts to amalgamate Freud and Marx had not yet come to fruition. Together with Buber's existentialist concepts, the subsoctivism propounded by de man was definitely absorbed into his own later theories of the individual and the social character of humanity". (Gerhard P. Knapp. The Art of Living; Erich Fromm's Life and works, Peter Lange, Newyork, 1989, Page – 18)
3. This book is part of a bread study concerning the character structure of modern and the problems of the interaction between psychological and socialogical factors which I have been working on for several years. "(Escape from Freedom", 1969. Avon, Page – VII)
4. "Freud went further than anybody before him in directing attention to the observation and analysis of the irrational and unconscious forces which determine parts of human behaviour". Escape from Freedom, Page – 23/-
5. "But man is not only made by history – history is made by Man." 1bid, Page – 28
6. If copitalism meant individual enterprise in the economic sphere, protestautism was individual enterprise in the religious sphere." J.A.C. Browse, 'Freud and the Post – Freudians', Pehican, 1964.)
7. "The loss of the self and its substitution by a pseudo self leave the individual in an intense state of insecurity. He is obsessed by doubt since, being essentially a reflex of other people's expectation of him, he had in a measure lost his identity. In order to overcome the panic resulting from such loss of identity, he is compelled to conform, to seek his identity by continious approval and recognition by others. Since he does not know who he is, atleast the others will know- if hearts according to their

expectations; it they know, he will know too, if to their expectations; if they know, he will know too, if he only takes their word for it." (Escape from Freedom, P-230)

8. See Page 17 of 'Beyond Choins of Illusion', Abascus, 1962,
9. "Doubt and the power of truth and humanism are the guiding and propelling principles of Marx's and Freud's work", 1bid, Page – 17.
10. While Marx defines the species character as "free, conscious activity" and sees mean as a being that produces with "foresigent and imagination. ( - Roiner Funk, in Erich Fromm: The courage to Be Human, Page : 56)
11. The Capitalist method of distribution by market mechanism is better than any other method devised so far in a class society...." (Erich from in The Save Society, Page, 84)
12. "Thus the history of man is a graveyard of great cultures that came to costastropic ends because of their incapacity for planned, rational, voluntary reaction to challenge". (Erich Fromm, May Man Prevail?, Page – 5)
13. "For Marx, socialism was the control of society from below, by its members; not from above, by a bureaucracy". (1 bid, Page 77)
14. Stalin, a shrewd, cymical opportunist with an insatiable lust for personal power. Drew the consequences of the·failure. Given his personality, socialism could never have meant for him the human vision of Marse or Engles...." (1bid, Page 41)
15. "Yet it is quite beyond doubt that the problems of social transformation are not as difficult to solve – theoretically and practically as the technical problems our chemists and physicists have solved." The same society)

**REFERENCES :**


1. Beyond the Chains of Illusion : My encounters with Marx and Freud' - Erich Fromm
2. The Sane Society – Erich Fromm
3. May Man Prevail – Erich Fromm
4. Escape from Freedom – Erich Fromm
5. Man for Himself – Erich Fromm
6. The Anatomy of Human Destructiveness – Erich Fromm
7. Escape from Authority : The perspectives of Erich Fromm
8. Erich Fromm : The Courage to Be Human – Reiner Funk
9. Erich Fromm – Don Hausdorff.
10. Freud and the Post Freudians – J.A.C. Brown
11. The Art of Living – Gerhard P.Knapp.

# పరాయితనం

- డి. పాపారావు

ప్రస్తుత స్థితిని చేరుకునే ముందు, మానవ చరిత్ర పలుదశలలో నడిచింది. వాస్తవానికి నేడు వివిధ సమాజాలు, దేశాలు, వివిధ అభివృద్ధి దశలలో ఉన్నాయి. కానీ, నేడు గ్లోబలైజేషన్ పేరుతో అమలు జరుగుతున్న ప్రపంచ వ్యాపిత ఆర్థిక విధానాల వలన, దరిదాపుగా ప్రపంచంలోని అన్ని దేశాలు ఒకే తరహా సామాజిక ఆర్థిక వ్యవస్థను ఏర్పరుచుకొంటున్నాయి. అదే పెట్టుబడి దారీ ఆర్థిక వ్యవస్థ. ప్రపంచంలోని అన్ని దేశాలు వేగంగా పెట్టుబడిదారీ మార్కెట్ వ్యవస్థలోకి లాగి వేయబడుతున్నాయి. ఈ పరిస్థితి ఏర్పడకముందు, ప్రపంచంలోని పలు మూడవ ప్రపంచ దేశాల ఆర్థిక వ్యవస్థలు ఫ్యూడల్ - భూస్వామ్య వ్యవస్థలో వున్నాయి.

ఫ్యూడల్ వ్యవస్థలో, సామాజిక సంబంధాల సాంద్రత ఎక్కువగా వుండేది. అంటే, ఆ సమాజాలలో మానవులు నిర్దిష్టపాత్రలు, బాధ్యతల చట్రంలో ఇమిడి ఉన్నారు. వారి సామాజిక ఆర్థిక స్థితిగతుల మార్పుకు బహు తక్కువ అవకాశాలు వున్నాయి. అయితే పెట్టుబడి దారీ వ్యవస్థ విశ్వవ్యాపితం అవుతుండడంతో, ఈ పరిస్థితి వేగంగా మారిపోతుంది, వ్యక్తిగత వాదం పెరుగుతోంది. సామూహిక జీవన విధానాలు ( జాయింట్ ఫ్యామిలీ వంటివి) కుప్ప కూలి పోతున్నాయి. అంటే సామాజిక కుటుంబ సంబంధాల ద్వారా మనుష్యులకు మానసిక భద్రతా స్థితి వుండే పరిస్థితి వేగంగా మారిపోతుంది. వ్యక్తి తన మానసిక - ఆర్థిక అవసరాలకై తన కాళ్ళపై తానే నిలబడవలసి వస్తోంది. తమ అస్థిత్వాన్ని తామే నిర్వచించుకోవాల్సి వస్తుంది. అంటే తగినంత మేర హేతుబద్ధత అభివృద్ధి చెందని స్థితిలో వున్న వ్యక్తులు పలువురు Individualised Existense లోకినెట్టివేయ బడుతున్నారు. ఇటువంటి పరిస్థితిలో వ్యక్తులు తమకు కొత్తగా లభించిన స్వేచ్ఛను భయోత్పాతంతోనే స్వీకరిస్తున్నారు. ఆ స్వేచ్ఛ కల్పించే బాధ్యతాయుతంగా వ్యవహరించవల్సిన పరిస్థితి వారిని ఆందోళనకు, భద్రతా రాహిత్యానికి గురిచేస్తోంది.

ఈ నేపథ్యంలోనే, మానవ జీవితం ముందు రెండు ప్రత్యామ్నాయాలు ఉంటాయనే ఫ్రామ్ ప్రతిపాదనను చూడాలి. అవి జంతు ప్రవృత్తికి తిరోగమించడం లేదా నిఖార్సు అయిన మానవ అస్థిత్వాన్ని అందుకోగలగటం. అయితే జంతు ప్రవృత్తికి తిరోగమించడం వేదనకు, మానసిక రుగ్మతకు దారి తీస్తుందని ఫ్రామ్ అంటాడు. ఇది మానవుడిని భౌతికంగా లేదా మానసికంగా నిర్జీవిని చేయ గలదనేది ఫ్రామ్ అభిప్రాయం. అయితే, పూర్తి పరిపక్వ మానవ అస్థిత్వాన్ని ఆవిష్కరించుకోగలగడం కూడా ఏమంత సులభం కాదనేది ఫ్రామ్ అభిప్రాయం. ఈ కారణం చేతనే మానసిక పురోగమనం దిశగా వేసే ప్రతి అడుగు భయానకం గానూ, బాధాకరంగాను ఉంటుందని ఫ్రామ్ పేర్కొన్నాడు. ఈ ప్రత్యేక కారణం దృష్ట్యానే, మానవుడు ప్రస్తుత సమాజంలో మానసిక పురోగమనం దిశగా తొలి అడుగులు వేయడానికి భయపడుతున్నాడనిపిస్తుంది. మానసిక తిరోగమనపు ఫలితాలు ఎంత దుర్భరమైనవి అయినా ఆదిశగా పయనించడమే సులువు గనుక, దాని తాలూకు పరిణామాలను ఆలోచించకుండానే నేటి సమాజంలోని పలువురు సులువైన మార్గమైన తిరోగమనాన్ని ఎంచుకుంటున్నారు. దీని ఫలితమే ఫ్రామ్ పేర్కొన్న ''స్వేచ్ఛ నుంచి పలాయనం''గా మనం

---

డి. పాపారావు, హైదరాబాదు, ప్రముఖ సామ్యవాది

గుర్తించవచ్చు. అంటే, వారు తమ స్వేచ్ఛను, తగిన మానసిక భద్రతకై; ఏదో ఒక ''గొప్ప వ్యక్తికి లేదా నియంతకు'' Surrender చేసేందుకు వెనుకాడరనేది ఫ్రామ్ ప్రతిపాదన. ఈ నేపథ్యంలోనే నేటి భారత దేశ స్థితిని మనం చూడవచ్చు. నిన్నా మొన్నటి ఫ్యూడల్ సంబంధాల భద్రత, ఉదారవాద ఆర్థిక విధానాల యుగంలో ఛిన్నాభిన్నమై పోతుంది. దీనితో నేడు, భారతదేశ ప్రజలలోని అనేక మంది నూతనంగా లభించిన స్వేచ్ఛను, బాధ్యతలను తట్టుకోలేని మానసిక భారంగా భావిస్తున్నారు. ఈ పరిస్థితిలో వారికి కావల్సింది "Escape from freedom" అంటే, ఫ్రామ్ వివరణల నేపథ్యంలో చూస్తే, నేడు భారత దేశ ప్రజలు ఒక Existential Dilemma లో వున్నారు. ఈ పరిస్థితి ప్రమాదకరం. ఈ స్థితిలో మనం ఏర్పరుచుకున్న ప్రజాతంత్ర వ్యవస్థలు, రాజ్యాంగం కుప్పకూలే అవకాశాలు మెండుగా వున్నాయి. హేతు బద్ధత, తోటి మానవుల పట్ల ప్రేమల పునాదిపై అర్థవంతమైన జీవితాన్ని ప్రత్యామ్నాయంగా ఇచ్చినప్పుడు మాత్రమే రానున్న ఉపద్రవాన్ని నిలువరించగలం. అయితే ఈ ప్రత్యామ్నాయానికి వున్న ఆచరణాత్మక అవకాశాలు బహు స్వల్పం.

పెట్టుబడి దారీ వ్యవస్థలో స్వేచ్ఛ నుంచి పలాయనం అనేది పరాయికరణ భావం చుట్టూ కేంద్రీకృతమై వుంటుందనేది ఫ్రామ్ అభిప్రాయం. ఈ వ్యవస్థలో కార్మికుడి శ్రమ మరింత యాంత్రికంగానూ, అలోచనా రహితంగానూ మారి పోతుందని ఫ్రామ్ వివరించాడు. సృజనాత్మకత, కుతూహలత, స్వతంత్ర ఆలోచనలకు తావులేకుండా పోతుందని ఆయన పేర్కొన్నాడు. దీని ఫలితంగా కార్మికుడు తిరగబడటమో లేదా పలాయాన వాదిగా మారిపోవడమో జరుగుతోందని ఫ్రామ్ విశ్లేషించాడు. ఈ మొత్తం ప్రక్రియలో, కార్మికుడు మానసికంగా తిరోగమన ధోరణులకు లోనవుతున్నాడని వివరించాడు. ఈ వివరణ, పరాయీకరణ భావానికి ఆమోద యోగ్యతను, విస్తృత ప్రాచుర్యాన్ని కల్పించిన మార్క్స్ భావనలతో సరిపోల్చి చూడవచ్చు. మార్క్స్ భావనలో పరాయీకరణకు ప్రయివేటు ఆస్తి కారణం. పరాయీకరణ వలన, వ్యక్తులు భౌతిక, నైతిక పతనానికి లోను అవుతారని మార్క్స్ పేర్కొన్నాడు. దీని వలన కార్మికుడి సహజ సిద్ధ మానవ స్వభావం వక్రీకరణకు లోనవుతుందని ఆయన వివరించాడు. పరాయికరణ వలన కార్మికులు తమ శ్రమలోని సృజనాత్మక భాగాన్ని కోల్పోతారని మార్క్స్ పేర్కొన్నాడు. అలాగే, కార్మికుడు తన భౌతిక, మానసిక శక్తి సామర్థ్యాలను స్వేచ్ఛగా అభివృద్ధి చేసుకోలేడని; వాటిని అణచి వేసుకుంటాడని విశదీకరించాడు. అంటే, తన సహజ స్వభావాన్ని కోల్పోయి జంతువు స్థితికి దిగజారిపోతాడని పేర్కొన్నాడు. ఈ రకంగా చూస్తూ పోతే పరాయీకరణ గురించిన ఫ్రామ్, మార్క్స్‌ల అభిప్రాయాలలో చాలా సారూప్యత కనపడుతుంది.

హైటెక్ పరిశ్రమ ఆవిర్భావంతో బిజినెస్, ప్రాసెస్, రీ యింజినీరింగ్ వంటి పలు ప్రక్రియల ద్వారా పెట్టుబడి దారీ వ్యవస్థలో పరాయీకరణకు కాలం చెల్లిందని పలువురు పెట్టుబడి దారీ మేధావులు చెప్పుకుంటున్నారు. అయితే, ఈ రంగంలోని పరిశ్రమలలో కూడా పరాయీకరణ వున్నది. గతంలో మునుపెన్నడూ లేని స్థాయికి ఇది చేరుకున్నది అనడానికి ''గ్లోబల్ స్క్వీజ్ - ద కమింగ్ క్రైసిస్ ఫర్ ఫస్ట్ వరల్డ్ నేషన్స్'' అనే పుస్తకంలో రిచర్డ్ సిలాంగ్ వర్త్ ఇచ్చిన సోదాహరణమైన వివరణలలో, కొన్ని సంక్షిప్తంగా చూద్దాం: పరాయీకరణ నిజంగా అధిగమించ బడాలంటే, ముందుగా వేతన బానిసత్వం, అదనపు విలువలు తొలగించబడాలి. కాగా పెట్టుబడి దారీ ప్రపంచంలో కూలి బానిసత్వం ప్రగాఢమౌతుంది అనటానికి, అదనపు విలువ దోపిడీ తీవ్రతర మౌతుంది అనటానికి, ఈ పుస్తకంలో

పలు ఉదాహరణలు వున్నాయి. శ్రమ శక్తి సరఫరా తాలుకు సప్లై- డిమాండ్ వ్యవస్థ రెండు రకాలుగా పని చేస్తున్నది. కొందరు ఉద్యోగులు, కొన్ని పదార్థాలలా అరుదైన, విలువైన వారు; వీరికి నింగిని అంటే వేతనాలు లభిస్తున్నాయి. అంటే, నూతన ప్రపంచ ఆర్థిక వ్యవస్థను నడిపించగల వారికి భారీ వేతనాలు లభిస్తున్నాయి. కాగా ఇతరులు, అంటే సామాన్య కార్మికుల విలువ పడిపోతుంది, అని లాంగ్ వర్త్ గణాంక వివరాలతో వివరించాడు. ఈ నేపథ్యంలో చూస్తే అమెరికా పెట్టుబడిదారీ వ్యవస్థలో కార్మికుల వేతనాలు, సామాజిక సదుపాయాలు భారీగా అభివృద్ధి చెందాయనే ఫ్రామ్ వివరణకు కాలం చెల్లిందనిపిస్తోంది. అలాగే పారిశ్రామిక రంగంలో కార్మికుని పాత్ర బాగా పెరిగిందనే ఫ్రామ్ వాదన కూడా నేటి కార్మికుల జీవన స్థితిగతుల దృష్ట్యా నిస్సారంగా మిగిలిపోతుంది. రీగన్, థాచర్ వంటి మితవాద రాజకీయ నాయకుల ప్రాబల్యం క్రింద పారిశ్రామిక రంగంలో కార్మికుల హక్కులు అడుగంటి పోయాయి.

గతంలో, అంటే పెట్టుబడిదారీ వ్యవస్థ ఆరంభ దశలో స్వయం ఉపాధి కల్పించుకున్న ఔత్సాహిక పారిశ్రామికవేత్తల సంఖ్య గణనీయంగా ఉందని ఫ్రామ్ వివరించాడు. దీనికి తార్కాణంగా పందొమ్మిదో శతాబ్దం ఆరంభంలో ఐదింట నాలుగు వంతుల మంది తమ ఉపాధిలో స్వావలంబనతో ఉండటాన్ని ఆయన సూచించాడు. కాగా రాను రానూ ఈ ఔత్సాహిక పారిశ్రామిక వేత్తల సంఖ్య కుచించుకు పోతుందని ఫ్రామ్ వివరించాడు. మరో ప్రక్క పెద్ద పెద్ద పరిశ్రమలలో ఉద్యోగులుగా పని చేసేవారి సంఖ్య పెరుగుతూ పోతుందనీ ఫ్రామ్ గణాంక వివరాలతో వివరించాడు. అయితే, ఆటోమేషన్, కంప్యూటర్ పరిజ్ఞానాల రంగ ప్రవేశంతో దరిదాపు అన్ని పెద్ద పరిశ్రమల్లోను ఉపాధిపై వేటుపడుతోంది. ఉద్యోగుల సంఖ్యను కుదించి వేయడం నేటి పారిశ్రామిక రంగంలో దైనందిన కార్యక్రమంగా మారింది. అంటే పందొమ్మిదో శతాబ్దపు ఔత్సాహిక పారిశ్రామిక వేత్త స్థానంలో ఇరవయ్యవ శతాబ్దంలో వేతన కూలీలు వచ్చారు. నేడు పలువురు ఉద్యోగులకు ఈ వేతన కూలీ స్థితి కూడా గగన కుసుమంగానే ఉంటోంది. అమెరికాలో ఉపాధి కోల్పోయిన మధ్య స్థాయి మేనేజర్లు, తమ లాప్‌టాప్‌లతో కన్సల్‌టెంట్‌ల పేరిట ఉపాధి మార్కెట్ లోకి రావడాన్ని, మనం మన నగరాలలోని పలు అడ్డాలలో రోజువారీ కూలీలు ఉపాధికై గుమికూడటంతో సరిపోల్చి చూడవచ్చునేమో!

పై పరిణామాలు మధ్య తరగతి వర్గం వేగంగా కార్మిక శ్రేణులలో చేరి పోవటాన్ని సూచిస్తున్నాయి. అంటే పెట్టుబడిదారీ వ్యవస్థ విస్తరించి వ్యాపించినకొద్దీ, దానిలో అధికశాతం జనాభా వేతన కూలీలుగా మారి పోతున్నారు. కాబట్టి, పెట్టుబడిదారీ దోపిడీ పెరిగిపోయి, పరాయీకరణ మరింతగా పెరుగుతోంది. కాబట్టి, పరాయీకరణను గురించిన ఎరిక్ ఫ్రామ్ ఆందోళన నేడు మరింత అర్థవంతమైనది. ఈ విధంగా పరాయీకరణ పెరిగి పోవడం వలన, పెట్టుబడి దారీ 'వ్యవస్థలో' ఒక ఉన్మాద స్థితి ఏర్పడుతోందని ఫ్రామ్ రచించిన **'The Sane Society'** అనే పుస్తకం నుంచి అర్థం చేసుకోవచ్చు.

పెట్టుబడిదారీ వ్యవస్థ మొత్తం మీద, ఆర్థికంగా మరింత సంపన్నవంతం అయింది. అయితే ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలన్నింటిలోనూ ఒకేమారు ప్రగతిని సాధించలేక పోతే ఆ ప్రగతి గనుక వీటిలో ఏదో ఒక రంగానికే పరిమితమైతే, అది మిగతా అన్ని రంగాలపైనా వినాశకర ప్రభావాన్ని చూపుతుంది అనే ఫ్రామ్ ప్రతిపాదన కూడా నేడు మనం గుర్తుచేసుకోవచ్చు. ఒక

పక్క పెట్టుబడిదారీ వ్యవస్థలో ఉత్పాదకత వేగంగా పెరుగుతుండగా మరో పక్క ఆర్థిక అసమానతలు కూడా భారీగానే పెరుగుతున్నాయి. గత యిరవై సంవత్సరాల కాలంలో అమెరికాలోని భౌతిక శ్రమ చేసే కార్మికులు తమ కొనుగోలు శక్తిలో పదిహేను శాతాన్ని కోల్పోయారు. 1979వ సంవత్సరంలో సాధారణ ఫ్యాక్టరీ కార్మికుడి కంటే కంపెనీలోని అత్యున్నత స్థాయి అధికారి వేతనం 29 రేట్లు ఎక్కువగా ఉంది. కాగా ఈ అగాధం 1992వ సంవత్సరం నాటికి 100 రెట్లకు పెరిగింది. ఐక్యరాజ్య సమితి నివేదికల ప్రకారంగానే (1996) ప్రపంచంలోని 358 మంది బిలియనీర్ల ఆస్తుల మొత్తం ప్రపంచంలోని 45% జనాభాకు ప్రాతినిధ్యం వహిస్తున్న దేశాలన్నింటి ఆదాయం కంటే అధికంగా ఉంది. అమెరికా జనాభాలోని పై ఒక్క శాతం లోని వారు, ఆ దేశం లోని పారిశ్రామికవాటాల్లో 37శాతాన్ని; ప్రయివేటు వ్యాపార ఆస్తులలో 50శాతాన్ని కలిగి ఉన్నారు. కాగా 38 మిలియన్‌ల మంది అమెరికా ప్రజలు పేదరికంలో మగ్గుతున్నారు.

ఓ ప్రక్క ఉత్పాదకత పెరగటం, మరో ప్రక్క దారిద్ర్యం పెరగటం తాలూకు పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలోని ఆర్థికరంగం తాలూకు అసహేతుకతను ఫ్రామ్ ఎండగట్టాడు. ఒక ప్రక్క పూట కూటికి నోచుకోనివారు కోట్లాది మంది ఉండగా, మరో ప్రక్క, పంటలు బాగా పండటాన్ని ఆర్థిక వినాశనంగా భావించే ధోరణిని ఆయన దీనికి ఒక ఉదాహరణగా పేర్కొన్నాడు. మార్కెట్‌ను స్థిరీకరించే పేరుతో వ్యవసాయ ఉత్పాదకతను పరిమితం చేయడాన్ని ఆయన నిరశించాడు. నేడు భారత దేశంలోని వ్యవసాయ రంగంలో నెలకొని ఉన్న పరిస్థితి కూడా దీనికి మచ్చుతునక. ఒక ప్రక్క F.C.I. గోడౌన్లలో పేరుకు పోయాయని చెబుతున్న ధాన్యం నిలువలు ఆ పేరుతో క్రాప్ హాలిడేలు; మరో ప్రక్క అర్థాకలితో పస్తులుంటున్న కోట్లాది మంది ప్రజలు - ఈ పరిస్థితి, నాడు అమెరికాను ఉద్దేశించి ఫ్రామ్ పేర్కొన్న స్థితినే పోలి ఉంది. అలాగే, ఆయుధాల ఉత్పత్తిని కూడా ఫ్రామ్ ఎండగట్టాడు. ఆర్థిక వ్యవస్థను కాపాడుకొనేందుకు, అంతూ పొంతూ లేకుండా అయుధాల ఉత్పత్తి సాగించడం మంచి ఆర్థిక విధానంగా చెలామణిలో ఉండగా - ప్రభుత్వం గనుక తలదాచుకునే గూడులేని వారికి ఇళ్ళు కట్టిస్తాను అంటే, ఆ ప్రతిపాదనను మాత్రం స్వేచ్ఛకు, వ్యక్తిగత చొరవకు ప్రమాదకరమని గగ్గోలు పెట్టేవారు వున్న ''రుగ్మతాగ్రస్త'' వ్యవస్థగా, పెట్టుబడిదారీ వ్యవస్థను ఆయన విశ్లేషించాడు. అలాగే, ఛీత్కార యోగ్యమైన కార్యక్రమాలను మీడియా ప్రజల ముందు వుంచుతున్నప్పుడు; ప్రభుత్వం గనుక, ఏదైనా మంచి, ఆరోగ్యవంతమైన ఎంటర్‌టైన్‌మెంట్‌కార్యక్రమ నిర్మాణానికి నిధులిస్తే - స్వేచ్ఛ, ఆదర్శవాదం పేరుతో దానిని విమర్శించే పరిస్థితి పెట్టుబడిదారీ వ్యవస్థలో వుందని ఆయన పేర్కొన్నాడు.

సాంకేతిక పరిజ్ఞానం పెరిగిన తరువాత, ప్రజలకు ఎక్కువ ఫ్రీ టైమ్ లభిస్తుందని ఆయన పేర్కొన్నాడు. కాగా, వాస్తవానికి నేడు ఈ పరిస్థితిలో మార్పు వచ్చింది. హై-టెక్ యుగంలో, అంతా ఫ్రీ టైమ్ వున్నవారు (అంటే నిరుద్యోగులు), లేదా సోకాల్డ్ వీకెండ్స్‌లో కూడా ఓవర్ టైమ్ చేస్తున్న అస్సలు ఫ్రీ టైమ్ లేనివారు - ఇదీ నేటి పెట్టుబడిదారీ వ్యవస్థలో వచ్చిన మార్పు. ఈ కారణం చేతనే, షాపింగ్‌లకు టైమ్ లేక, వస్తువుల అమ్మకాలు పడిపోవడం వలన, జపాన్ ప్రభుత్వం తన దేశంలోని ఉద్యోగులకు, (షాపింగ్‌లకై!) అదనంగా సెలవు తీసుకోవాలసిందిగా ప్రజలను బుజ్జగిస్తున్నది.

మొత్తం సమాజమే జబ్బుపడి వుందని, ఇది మెజారిటీ ప్రజల మన స్థితి కనుక అదే Normal స్థితిగా చలమాణి అవుతుందని ఫ్రామ్ పేర్కొన్నాడు. దీనికి ఒక చక్కటి ఉదాహరణ : అమెరికాలోని,

ఒక బహిరంగ ప్రదేశంలో ఒక వ్యక్తి తన వింత మేనరిజమ్స్‌తో (నేటి చైనాలోని ఫాలున్‌గాంగ్ లాగా) నలుగురి దృష్టిలో పడ్డాడు. దానితో 'నార్మల్'గా వున్న ఆ ఏరియా నివాసులు, ఈ వ్యక్తిని పిచ్చివాడిగా భావించి, పోలీసులకు అప్పగించారు. ఆ వ్యక్తి తన మేనరిజమ్స్ పిచ్చికాదనీ, అవి తమ ఆచారాలని, పలు విధాలుగా పోలీసులకు నచ్చ చెప్ప జూసాడు. అయితే ఇవేమి నమ్మని పోలీసులు, ఆ వ్యక్తిని Mental Asylumకు తరలించారు. అయితే మరుసటి రోజునే, ఈ వ్యక్తి చూపిన మేనరిజమ్స్ చూపుతున్న పలువురు, ఆ వ్యక్తి, తమ మతానికి చెందినవాడని, పిచ్చివాడు కాదని, ఆసుపత్రి యాజమాన్యం వద్దకు వచ్చారు. ఇంతమంది ఒకేరకం మేనరిజమ్స్ వున్న మనుషులు కనపడటంతో, తాము ఆసుపత్రిలో చేర్చుకున్న వ్యక్తి కూడా ''సాధారణ'' మనో స్థితిలోనే ఉన్నాడని నమ్మి ఆ వ్యక్తిని అతని కోసం వచ్చిన వారితో పంపించివేసారు. అంటే నలుగురు చేసేది ఏదైనా 'Normal' అని, దీనికి భిన్నమైనది ఏదైనా abnormal అని భావించటంవలన Insane Society 'Normal' గా చెలామణి అవుతుందని ఫ్రామ్ వివరించాడు. దీనికి పైన పేర్కొన్న ఉదాహరణే తార్కాణం.

సామాజిక - ఆర్థిక అభివృద్ధిలో బాగంగా భౌతిక సంపద దృష్ట్యా కంఫర్టబుల్ జీవితం, వీలైనంత మేర పంపిణీలో సమానత్వం, స్థిరమైన ప్రజాస్వామ్యం, శాంతియుత పరిస్థితులు అన్నవి పాశ్చాత్య ప్రపంచపు లక్ష్యాలని ఫ్రామ్ అంటాడు. కాని వాస్తవానికి ఫ్రామ్ ఈ మాటలు పేర్కొన్న దశాబ్దాల తరువాత, పాశ్చాత్య ప్రపంచం, ఈ లక్ష్యాల నుంచి కూడా వైదొలుగుతుంది. ఒకప్పుడు అభివృద్ధి చెందిన దేశాలలో కార్మికుల జీవనస్థితిగతులు, వారి యజమానుల అదృష్టం ప్రకారం మారుతుండేవి. అంటే, ఉత్పాదకత పెరిగితే, మంచి ఉపాధి అవకాశాలు ఉండేవి. నిరుద్యోగం తక్కువగా ఉంటే, వేతనాల స్థాయి పెరిగేది. అయితే నేడు ఈ పరిస్థితి మారి పోయింది. ఉద్యోగుల సంఖ్యను కంపెనీలు తగ్గించినకొద్దీ, ఆ కంపెనీల వాటాల విలువలు పెరుగుతున్నాయి. అంటే, ఉద్యోగులకు ఏదైతే దుర్వార్త అవుతుందో, అది వారి యజమానులకు శుభవార్త అవుతోంది. అంటే భౌతికంగా కంఫర్టబుల్ జీవితం అనేది పాత అర్థంలో ఉద్యోగులకు ఇకలేదు. కార్పొరేట్ పరిశ్రమల లాభాల స్థాయి పెరిగిన కొద్దీ, వాటిలోని ఉద్యోగులకు భౌతికమైన కంఫర్టులు తగ్గిపోతున్నాయి. అలాగే, ప్రభుత్వాలు; కార్పొరేట్ విభాగం, అలాగే ధనవంతులపై విధించే పన్నులను తగ్గిస్తున్నాయి. కాగా, మరో ప్రక్క వేతనాలపై పన్నులు పెరుగుతున్నాయి. అమెరికా దేశపు ప్రభుత్వ ఆదాయంలో నేడు 50% వరకు, వేతనాలపై పన్నుల నుంచే వస్తుంది. ఈ మొత్తం కార్పొరేట్ పన్నుల కంటే 4 రెట్లు ఎక్కువ. రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు కార్పొరేట్ విభాగం, ప్రభుత్వ పన్నుల ఆదాయంలో 3వ వంతు భాగాన్ని సమకూర్చేది. ఇప్పుడు ఆ మొత్తం కేవలం 12% కి పడిపోయింది. బడా పారిశ్రామిక రంగం, కార్మికుల మధ్య వున్న అలిఖిత సామాజిక ఒప్పందం రద్దు అయిపోయింది. కాబట్టి, ప్రజలకు భౌతికంగా కంఫర్టబుల్ జీవితం ఇవ్వటం అనేది ఇక ఎంత మాత్రము లక్ష్యం కాదు. దీనివలన స్థిరమైన ప్రజాస్వామ్యంగా ఫ్రామ్ పేర్కొన్న పాశ్చాత్య దేశాల లక్ష్యం ఇక ఇప్పుడు నెరవేరే అవకాశం లేదు. నిన్నా మొన్నటి అమెరికా ఎన్నికలలో నెలకొన్న, నువ్వా నేనా అన్నట్లు వున్న పరిస్థితి, రానున్న పరిస్థితికి ఒక మచ్చుతునక. 'Arrogant Capital' అనే పుస్తకంలో కెవిన్ ఫిలిప్స్, నేడు అమెరికా ప్రజలలో అత్యధిక శాతం ఆ దేశ వ్యవస్థ మారాలని కోరుకుంటున్నారని పేర్కొన్నాడు. వాషింగ్టన్ నగరాన్ని కార్పొరేషన్లు, వాల్‌స్ట్రీట్ ధనికులు నడుపుతున్నారని అమెరికాలో హెచ్చుమంది ప్రజలు భావిస్తున్నారు. ఈ పరిస్థితి మారాలంటే, పూర్తిగా అమెరికా వ్యవస్థ మారాలని 61% మంది అమెరికా ప్రజలు కోరుకుంటున్నారు.

అంటే అమెరికా వ్యవస్థలోని 'స్థిరమైన ప్రజాస్వామ్యం' నేడు సవాలుకు లోను అవుతోంది. G - 7 దేశాలన్నింటిలో కూడా రాజకీయ వ్యవస్థపై ఇదే రకమైన అసంతృప్తి వుందని ఫిలిప్స్ వివరించాడు. ప్రతి తరానికి ఒకసారి, రక్త రహిత బ్యాలట్ విప్లవంతో పునర్జీవింపబడే, రెండు పార్టీల వ్యవస్థ నేడు పతనం అంచుకు చేరుకొందని ఆయన పేర్కొన్నాడు. అమెరికా ఉద్యోగులు, గతంలో వారి ఉపాధిలో భాగంగా పొందిన సౌకర్యాలు కూడా, ఇప్పుడు అంతర్ధానమౌతున్నాయి. అంటే, వారికి గతంలో వున్న సౌకర్యాలైన ఆరోగ్య భీమా, పెంఛన్ల పథకాలు, అలాగే నిరుద్యోగ భీమా మొదలైన సౌకర్యాలు కుచించుకుపోతున్నాయి. కాబట్టి, భౌతికంగా కంఫర్టబుల్ జీవితం, relative గా సంపద సమాన పంపిణీ, స్థిరమైన ప్రజాస్వామ్యం అని పాశ్చాత్య ప్రపంచపు లక్షణాలుగా ఫ్రామ్ పేర్కొన్న అంశాలు నేడు మారిపోతున్నాయి.

ఫ్రామ్ పేర్కొన్న, మానవుడి 'Potential Passions' అనే నాటి వ్యక్తీ కరణకు, సమాజంలో రాను రాను అవకాశాలు కుంటుపడి పోతున్నాయి. వ్యక్తులలోని లోపాలనే వారి బలాలుగా ఆకాశానికి ఎత్తే సంస్కృతి మరింతగా వేళ్ళూనుకుంటోంది. అంటే Social Pathology గా ఫ్రామ్ పేర్కొన్నది నేడు మరింత నిజమౌతుంది. వ్యక్తి బలహీనతలను ఆతని బలాలుగా పైకెత్తే సంస్కృతి గురించి గోథే ఈ విధంగా పేర్కొన్నాడు:- నేను డబ్బు ద్వారా కొనగల్గింది, ఆడబ్బు యజమానిగా నా స్వభానంలో భాగమౌతుంది. అంటే నా డబ్బు తాలూకు శక్తే నా శక్తి అవుతోంది. అంటే నేను ఏమిటి, ఏమి చేయగలనో అనేది, నా వ్యక్తిత్వంపై ఆధారపడి లేదు. నేను కురూపిని, కాని, నేను అందమైన స్త్రీలను కొనుక్కోగలను. కాబట్టి నేను కురూపిని కాదు. అంటే నా కురూపి లక్షణాన్ని, నా డబ్బు అధిగమింపజేస్తోంది. ఇలా, వ్యక్తుల బలహీనతలే, వారి శక్తి సామర్థ్యాలుగా మారే పరిస్థితి, నేడు పెట్టుబడి కేంద్రీకరణలతో మరింతగా పెరిగిపోతుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థలోని, మానవుని సాధారణ మనోస్థితిని చంపివేసే అంశాలు ఒక స్థితి దాటి కొనసాగలేవని ఫ్రామ్ వివరించాడు. పాలక వర్గాల ఆధిపత్యం, దోపిడీ తాలూకు రాక్షస వ్యవస్థ క్రింద, మెజారిటీ ప్రజలు భయభ్రాంతులై, సందేహాస్పదులుగా మారే, ఒంటరితనాన్ని ఎదుర్కొనే పరిస్థితి వలన ఆ ప్రజలలో నిర్లిప్తత ఏర్పడుతుందని, వ్యక్తిగత చొరవ కొరవడుతుందని ఫ్రామ్ పేర్కొన్నాడు. దీనివలన, ఆ ప్రజలు తమ పాలకులకు అవసరమయ్యే విధులను కూడా నిర్వహించలేని పరిస్థితి వస్తుందని ఫ్రామ్ వివరించాడు. నేడు పాశ్చాత్య ప్రజాస్వామ్యాలలో ( వాస్తవానికి ప్రపంచమంతా) పెరిగిపోతున్న అసమానతలు, అసంతృప్తి, అణచివేత ఆయా దేశాలలోని ప్రజలలో రానున్న ప్రతిస్పందనకు ముందస్తు సూచికగా వున్నాయని మనం భావించవచ్చు.

అంతిమ పరిశీలనలో ఫ్రామ్‌ను పెట్టుబడిదారీ వ్యవస్థ తాలూకు అద్భుతమైన సామాజిక విశ్లేషకుడిగా భావించవచ్చు. అలాగే ఆయన పెట్టుబడిదారీ వ్యవస్థలో వ్యక్తి అస్థిత్వం తాలూకు మౌలిక సమస్యలను కూలంకుషంగా పరిశీలించాడు. అయితే ఆర్థిక, రాజకీయ సంబంధిత అంశాలలో ఫ్రామ్ పరిశీలనలలో కొన్ని లోపాలు తొంగి చూస్తున్నాయి. పెట్టుబడి దారీ ఆర్థిక వ్యవస్థ దాని ''స్వర్ణయుగం'' లో వున్న కాలంలో ఫ్రామ్ రచనలు కొనసాగటం దీనికి బహుశా ఒక కారణం కావచ్చు. ఏదేమైనా పెట్టుబడిదారీ వ్యవస్థను దాని తాలూకూ మరో నూతన దృక్కోణం నుంచి మానవీయంగా పరిశీలించిన ఘనత ఫ్రామ్‌కు చెందుతుంది. ఈ విధంగా ఫ్రామ్ చిరస్మరణీయుడు.

# పాపులర్ సైన్స్ ఎంతవరకు పాపులర్?

- నాగసూరి వేణుగోపాల్

ఇది అంత సులభమైన ప్రశ్నకాదు. అంతేకాదు దీనిగురించి ఎక్కువమంది ఆలోచించరు. ఇది పాఠకులు, సంపాదకుల విషయంలోనే కాదు - సైన్స్ రచయితల విషయంలో కూడా! లేకపోతే ఎక్కడవేసిన తెలుగు పాపులర్ సైన్స్ గొంగళి అక్కడే ఎందుకుంది? 1910లో డా॥ ఆచంట లక్ష్మీపతిగారు 'ఆంధ్రపత్రిక' సంవత్సరాది సంచిక వ్యాసానికీ - యిప్పటికీ ఏవైన తేడాలున్నాయా? కొద్దిగా వ్యవహార భాష వచ్చి చేరిందే కానీ - శిల్పరీత్యా గణనీయమైన మార్పులు ఎంత వరకు వచ్చాయి? ఇక సమాచారం అంటారా - అదికల్పితానికి వీలులేదు గనుక ఏదో ఒక ఆధారం నుంచి రాక మానదు. తెలుగులో మిగతా సాహిత్య ప్రక్రియలలో వచ్చిన పరిణామం యిక్కడ ఎందుకు రావడం లేదు? అసలు పాపులర్ సైన్స్ రచనను సాహితీప్రక్రియగా ఎంతమంది పరిగణిస్తారు? ఎంతమంది సాహితీ ప్రియులు, రచయితలు సైన్సు అంశాలు చదువుతారు? సాహిత్యాన్ని అభిమానించే వారంతా పాపులర్ సైన్స్ యిష్టపడకపోవడానికి కారణం ఏమిటి?

ఈ విషయాలు పరిశీలించే ముందు పత్రికలు, ప్రచార మధ్యమాలలో సైన్సు ఎలా వుందని తెలుసుకోవడానికి మూడు విశ్లేషణలు అందుబాటులో వున్నాయి. 1999 నవంబరునుండి 2000 జనవరి దాకా 31 హిందీ పత్రికలు, 21 ఇంగ్లీషు పత్రికల్లో సైన్స్ గురించి విగ్యాన్‌ప్రసార్ సర్వే చేసింది. సగటున ఆంగ్ల పత్రికల్లో 3.3 అంశాలు, హిందీలో 2.5 అంశాలు మాత్రమే రోజువారి వున్నాయని తేలింది. వీటిల్లో కూడా దాదాపు 31.8 శాతం ఆరోగ్యం, వైద్యం కాగా ఇన్ఫర్మేషన్ టెక్నాలజి 9.8 శాతం, పర్యావరణం 8.1శాతం, అంతరిక్షం 6శాతం, వ్యవసాయం 4.4శాతం, పరిశోధనలు 4.5 శాతం వుంటున్నాయి. ఇక మిగతా అంశాలు - సమాజం సైన్స్ ప్రభావం, సదస్సుల సమాచారం, మొదలైనవి యింకా తక్కువ. ఇందులో సగానికి పైగా 50.8 శాతం వార్తల రూపంలో వుంటే, 28 శాతం వ్యాసాల రూపంలో వుంటున్నాయి. మిగతా నివేదికలు. ఫీచర్లుగా వుంటున్నాయి. ఇక్కడ కూడా ఈ అంశాలు ఏదో ఒక ప్రత్యేకమైన పేజీలో కాకుండా దాదాపు 71.3 శాతం ఎక్కడ బడితే అక్కడ యిస్తున్నారు. అయితే 10 శాతం మాత్రం మొదటి పేరులో ఆక్రమిస్తున్నాయి. మనపత్రికలలో ఆక్రమంలో సైన్స్ అంశాలలో దాదాపు 78.1 శాతం మన దేశపు వార్తలు కావడం విశేషం. విదేశాలకు సంబంధించినవి ఐదోవంతు మాత్రమే! వీటిలో కూడా ఫ్రీలాన్స్ అంశాలే 28.1 శాతం ఆక్రమిస్తున్నాయి. విదేశ వార్తా సంస్థలు 11.5 శాతం, దేశీయ సంస్థలు 27.5 శాతం ప్రచురింపబడుతున్నాయి. పత్రికల ప్రత్యేక ప్రతినిధుల అంశాలు 11.7 శాతం మాత్రమే! ఇందులో సైతం కేవలం పాతిక వంతు అంశాలు మాత్రమే ఫోటోలతో జతపరచబడ్డాయి.

---

నాగసూరి వేణుగోపాల్, విజయవాడ, ఆకాశవాణిలో ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్.

ఇవి సర్వేలో తేలిన అంశాలు. విగ్యాన్ ప్రసార్ ఈ అంశాలు విడుదల చేస్తు పత్రికలకు ప్రత్యేకంగా సైన్స్ ఎడిటర్ ళుండాలని అభిప్రాయపడింది. ఇది ఎంతో అవసరం కూడా! ఉదాహరణకు 'ది హిందూ', 'ది టైమ్స్ ఆఫ్ ఇండియా' యిచ్చే సైన్స్ అంశాలకు పొంతన వుండదు. అలాగే మన దిన పత్రికలలో ప్రధానమైనవి 'ఈనాడు' 'వార్త' లలో కూడా యిటువంటి తేడా కనబడుతుంది. అన్నీ సైన్స్ వార్తలు అయినప్పుడు ఒక పత్రికలో వచ్చిన సైన్స్ అంశాలు మరో పత్రికలో అసలు రాక పోవడానికి కారణం ఏమిటి? (తొలి పుటలో వచ్చే అంశాలు విషయంలో మినహా) ఒక పత్రిక ప్రముఖంగా, ఒక్కోసారి సంపాదకీయం వ్రాసినా - మరో పత్రిక అసలు రాయదు. దీనికి కారణం ఆ అంశాలు ఎంపికచేసే వారిలో 'అభిరుచి' తేడా వుండటమే! సైన్స్ సార్వత్రికమైనా, యిటువంటి సాధకబాధకాలు తప్పనిసరి అవుతున్నాయి. మరో విషాదకరమైన అంశం ఏమంటే - సైన్స్ ఐటమ్‌కీ, ఫిల్లర్‌కీ తేడాలేక పోవడం. ఏజన్సీ అంశాలు రాగానే అనువదించి, వరుసగా యివ్వడం అరుగుతోంది. అంతేకానీ దాని సామాజిక కోణం అసలు స్పృశించడం లేదు. ఇంకా చెప్పాలంటే కేవలం సమాచారం మాత్రమే! విగ్యాన్ ప్రసార్ నిర్వహించిన సర్వే వంటిది తెలుగులో కూడా వస్తే మరిన్ని విషయాలు బోధపడుతాయి. సంపాదక వర్గంలో సైన్స్‌లేమి మాత్రం కొట్టవచ్చినట్టు కనబడుతోంది. సైన్స్ రిపోర్టింగ్, ఎడిటింగ్, సబ్బిగ్ అవసరమని యింకా గమనించక పోవడం విషాదకరం. ఈ విషయం పత్రికాధి పతులకూ, సంపాదకులకూ తెలియదా? అలా అనుకోవడానిక వీలులేదు. ఎందుకంటే పత్రికా రంగంలో టెక్నాలజీ తెచ్చిన మార్పులు అన్ని, యిన్ని కావు. అటువంటి సైన్స్, టెక్నాలజి, మెడిసిన్, అగ్రికల్చర్‌లకు ఒక డెస్క్ వుంటే ఎంతో లాభమని మనం చెప్పడం కొత్త విషయం కాదు.

ఆరోగ్యం సంబంధించి సైన్స్ రచన గురించి NISTADS (నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ సైన్స్, టెక్నాలజి, అండ్ డెవలప్ మెంట్ స్టడీస్) ఢిల్లీలో కొంత అధ్యయనం జరిగింది. దిలీఫ్ సాల్వి, భార్గవీదత్‌లు కలిసి చేసిన ఈ పరిశీలిన సైన్స్ అండ్ కల్చర్' అనే పత్రికలో ఈ మధ్య వచ్చింది. ఆరోగ్యం, వైద్యం గురించి సైన్స్‌లో పాపులర్‌గా రాసే వారికి మంచి డిమాండ్ వుందని ఈ అధ్యయనం చెబుతోంది. పాపులర్ సైన్స్ అంశాలలో దాదాపు 22.3 శాతం ఆరోగ్యం, వైద్యంపై వున్నా కేవలం 2.3 మంది సైన్స్ రచయితలకు మాత్రమే వైద్య శాస్త్రం లోబడి వుంది. మరో ఆసక్తికరమైన అంశం ఏమంటే, సైన్స్ రచయితలలో 3.1 శాతం మంది మాత్రమే టెలివిజన్‌కు రాస్తున్నారు. ఇంకో అంశం ఏమంటే పాపులర్ సైన్స్ రచన అనేది ఒక ఆరోగ్య అవకాశంగా ఎవరూ ప్రచారం చేయడం లేదు. ఈ సర్వే చెప్పే మరో అంశం ఏమంట జీవ శాస్త్రాలు, పర్యావరణం వంటి అంశాలేకానీ భూగర్భ శాస్త్రం, ఇంజినీరింగ్, టెక్నాలజి, పరిశోధనలు వంటి అంశాల గురించి రాయడం లేదని, దీనికి కారణం వారికి సరైన వనరులు అందుబాటులో లేక పోవడం. సైన్స్ కమ్యూనికేషన్' ను ఒక వొకేషనల్ సబ్జెక్టుగా బోధించాలని దిలీఫ్ సాల్వి అభిప్రాయపడుతున్నాడు.

ఇక తెలుగులో వైద్య విజ్ఞానం విషయానికి వస్తే - డ్యాక్టర్లు దీన్ని ప్రచార సాధనంగా, వ్యాపార లాభంగా పరిగణించడంతో అందులో పరిశ్రమకన్నా, మసాల దట్టింపు అధికంగా వుండటంతో పాటు తమ యిమేజి పెంచుకోవాలని ఉబలాట పడతారు. ప్రస్తుతం వైద్యం కార్పొరేట్ బిజినెస్ కావడంతో యిది ఉచిత ప్రచారం కావడంతో డ్యాక్టర్లు పత్రికా రంగంతో లాబీలు తయారు చేసుకుంటున్నారు. అందుకే కొందరి డ్యాక్టర్ల ఫోటోలు, పూర్తి చిరునామాలు కనబడుతాయి. ఇలా ప్రచురింపబడే అంశాలలో పాత చింత కాయ పచ్చడిలాంటి అంశాలు. చివరలో సంప్రదించండి అంటూ ఫోన్ నెంబరు తప్ప - వీరెవరైనా తాజా పరిశోధనల మీద రాస్తున్నారా? వీరి లోబడి ధోరణి లేక పోతే యిటీవల 'హ్యూమన్ జనోం ప్రాజెక్టు' మీద అదేదో మృత సంజీవని విద్య వంటిదని ప్రచారం జరిగి వుండేది కాదు. ఈ తరహా అప్‌డేట్ చేసుకోని అసమర్థత ఒక పార్శ్వం కాగా - అన్నింటిలో సెక్స్ మేళవించి ఊర పిచ్చుక లేహ్యం తయారు చేసి పంచడం మరో అంశం. సైన్స్ కథలో చివరి పేరాలో నీతి వున్నట్టు, 'సందేహాలు' లో చివర ఎక్కువ

సందేహం వుంటుంది, కానీ అంతవరకు సెక్స్ రంజుగా సాగుతుంది. వ్యాపారంలో కూరుకు పోయి అనైతిక చర్యలకు పాల్పడే వారికి సమాజం అంటూ లెక్చర్లివ్వడం శుద్ధ వేస్టు? చివరకు సినిమా పత్రికల్లో కూడా సెక్స్ డ్యాక్టర్ల జవాబులు పెట్టడం ఏమిటి?

పన్నెండేళ్ళలోపు పిల్లలు సైన్స్ పుస్తకాలు చదవక పోతే వారు మనకిక దక్కనట్లే- అని అమెరికన్ సైన్స్ రచయిత సెమ్యూర్ సైమన్ (Sey mour Simon) అంటాడు. మరివార్ని ఉద్దేశించిన పుస్తకాలు ఎలా వున్నాయి? ఈ విషయం గురించే దిలీఫ్ సాల్వి జర్మనీ సంస్థకోసం భారతీయ భాషలలోని 20 పుస్తకాలు పరిశీలించి కొన్ని అంశాలు పేర్కొన్నాడు. మన పుస్తకాలు ఎక్కువ సమాచారం, తక్కువ భావనలు, తక్కువ ఫోటోలు, ఎక్కువ ఊక దంపుడు వుంటాయట. మన పుస్తకాలలో ప్రయోగవివరాలు తక్కువగా వుండడం మాత్రమే కాక, చెప్పే విషయాలకు ఊతం కల్పించే వివరాలు లేక పోవడం జరుగుతోంది. మన రచనలో రచయితలకు తెలిసిందంతా కనబడుతుంది. అయితే పాశ్చాత్య రచనలలో 'సమగ్ర' అవగాహన ద్యోతకమవుతుంది. మన పుస్తకాలు యమ సీరియస్‌గా రాయబడి వుంటే అక్కడ ఆహ్లాదకరమైనశైలిలో రాయబడి వుంటాయి. మన దేశంలో వ్యాసం చివర మరిన్ని విషయాల కోసం ఏమి చదవాలో అసలు రాయరు. అయితే యితర దేశాలలో యిది తప్పనిసరి.

ఈ విషయాలు గమనిస్తే మన పాపులర్ సైన్స్ ఎంత వరకు పాపులర్‌గా వుందో బోధపడుతుంది. దీనికి తరుణోపాయం మొదట సైన్స్ రచయితలకు సరైన దృక్పథం వుండటం, తర్వాత మీడియా ప్రముఖులకు తమ ఆలోచనతో ప్రభావితం చేయడం, ఆరీతిలో పాఠ్య ప్రణాళికలు తయారయ్యేలా చూడటం జరగాలి.

MISIMI/మిసిమి RNI Regd.No.45042/90 Telugu Monthly, Hyderabad-500 020. Postal Regd. No.H/SD/191.



# మహోన్నత దేవదూత

ఈ చిత్రాన్ని బొలొగ్న కళాకారుడు గెయిడోరెని (1575 - 1642) పెయింట్ చేశాడు. ఇటలీకి చెందిన బార్క్ పెయింటర్స్‌లో అత్యంత ఉన్నత కళా విలువలకు చెందిన వాడని ఇతనిని కీర్తిస్తారు. బార్క్ పెయింటర్స్ అంటే 17, 18 శతాబ్దాలకు చెందిన కళాకారులు. వీరు ప్రతి చిన్న విషయాన్ని అత్యంతంగా గొప్పగా, విస్తృతాలంకరణతో చిత్రిస్తారు అదొక కళాశైలి.

పోప్ అర్బన్ VIII కి సోదరుడైన కార్డినల్ సాన్ ఒనొఫ్రియో, ఆదేశించగా ఈ చిత్రాన్ని తయారు చేశాడు. ఇతనిని 1635లో ఉరి తీశారు.

నాటి సాహిత్యం ఈ చిత్రాన్ని అందానికి ఆదర్శం అని పొగిడింది. ఈ దేవదూత పోజు, రంగుల మేళవింపు రెని శైలికి అద్దం పడతాయి.